# ప్రభావతి

---

శ్రీకరంబు లగురత్నంబుల కాకరంబు లగు సముద్రములును, కనకం బాదిగాఁ గల్గు లోహములకుఁ దావలంబు లగుపర్వతంబులును, గలిగి సమస్తసస్యపుష్పఫలంబులకు జన్మస్థానం బైనయార్యావర్తంబున బహువిధరాజమందిరంబులకు నిలయం బై కైలాసకేళీగృహంబులతోడ స్పర్ధ్యం బై, సకలమునిగణనివాసయోగ్యం బై, ధరాతలంబున కలంకారం బై యమరావతిం బురుడించు ద్వారక యనుపట్టణోత్తమం బొండు గలదు. అప్పురవరంబున వాసుదేవుండు బంధుమిత్రులతోడం గూడి సకలవిధసుఖంబుల బడయుచు నారాయణావతారం బని పరిగణింపంబడుచుండెను. ఆకాలంబున నాతనిజనకుం డగు వసుదేవుం డొకయాగంబు నిర్వర్తింప నుద్యుక్తమానసుం డై వలయునుపకరణంబుల సమకూర్చి దీక్ష వహింప నున్నయవసరంబున పాకశాసనుండు లోకహితకార్యపర్యాలోచనంబున దామోదరునికై నాకంబు వెడలి నడతెంచుచు ద్వారకాపురంబు దవ్వులం గాన్పింపం జనవేయికన్నులుం జాలక వెఱఁగుపడి యాపట్టణప్రశంసకు తిరస్కారంబు సేయుచుండ నిలింపవల్లభుకీవిం బరికించి యంచితనయనారవిందంబుల నాసహాసార్ద్రత నవలోకించి తదీయమాతుం డగుమాతలి యాతనితో నిట్లనియె. «దేవా! తావకీనసయనచకోరం బీపురీతిలకంబును దిలకించి నివ్వెఱఁ గందుచున్నయది. నాకస్వామికి నాశ్చర్యంబు గలుగఁజేయుపురంబిది గలిగియుండుట యింత గాకుండునే? పడమటిదిశ సంభోరాశియుఁ గడమదిశలఁ గమనీయం బగువనచయంబును గల్గియుండు నీపురలక్ష్మి నవలోకింప దామోదరవ్యాప్తయవనిని యటునింగోచాంచు నన నింపు గుల్కుచున్నది. నీపురప్రాంతంబులయం దుండెడు దునవసస్యంబుల పోతలచే వేష్టింపబడియున్న ఘూర్మాకారంబు దాల్చి యాకాశంబును గ్రమ్మి చూచువారికమనమ్ముల కంబరంబున నున్నయభ్రరాజంబు లీపాదసాక్షియై సముద్రోదకంబును దాగి ఖండఖండంబులుగఁ జెలి భువికి జేరెంచుచున్నవయంబున గన్పట్టుచున్నవి. కోటలచెంగట జాలు నవతారమూర్తి యనుచు పేందుచిని బాయఁజాలని భోగికులేంద్రుఁడు తనమ్ముల నెల్ల కోటలుగ ఫణాభోగంబు సౌధప్రాంగణంబుగ జేర్చిలిది యామహాత్మునితో సుఖింప నీపురంబున కలంకారం బగురీతి నవతారంబు ధరించినట్లు

గాన్పించుచున్నయది. లేకున్న నీశృంగారం బెంతైన కలదా? చంద్రకాంతశిలాస్థాపితంబు లగు సౌధంబులును, కురువిందంబు లమర్పఁబడిన కుట్టిమస్థలంబులును గలిగి యపూర్వశిలాపసంపద నొప్పారుచున్న యీపట్టణపుసొంపు గాంచిన యాంగీరసుండుఁ దైతము వసంతాగమవిలాసంబులతోడ నొప్పు మామిడితోటయో లేక కళలచే నొప్పారుకోటయో యనుసందియంబు జెందికమానడు. నగరులపై నెత్తిన శ్వేతపతాకలు పవనవేగంబున వింతగ తాండవం బాడుచుండె. కోటబురుజులపై సైనికసమూహము లనుక్షణంబును జాగరూకతతోఁ గంటిని ఱెప్పచందంబున గాచుచుండిరి. అటనుండి కదలి నడచువారికి వీథి నొసంగు తరువు లిరుప్రక్కల నున్నమార్గంబులును మధ్యమధ్య రమణీయంబు లగు విలాసగృహంబులును సమీపంబున సువాసనల నొసంగుపుష్పవృక్షసముదయంబును నందందు నలయికం దీర్చుకొనుటకు నున్నవేదికలును, నలుప్రక్కల సోపానంబుల నమర్చి నతటాకంబులం గలతామరలచెంగట విహరించు రాయంచలజోడులు విడంబించుటచే నీరాజము మిగుల రమణీయంబుగ విలసిల్లుచున్నది. ఈవీడు సమస్తశృంగారంబులచే ధరణీతటిల్లతచందంబున నున్నకారణంబున మేఘ మొకవేళ సిగ్గున నీపురంబునకు రాకుండినను భయంబు లేదు. ఏలన గంగాతరంగిణిజలం బపరిమితంబుగఁ బారి సస్యమును బోషించుచున్నది. కోలంత యేమి?" అని యనేకవిధంబుల రథికసారథు లిరువురు నాయావస్తుసందర్శనకుతూహలంబున బహువిధములఁ బొగడుచు నాపురప్రాకారంబు నంగడొకియు పవనంబున భూభాగంబునకుం దిగి పురంబులోనికిం జనుచున్నంత వారిరాక విని నారాయణుండు తనప్రియసహోదరుం డగుసాత్యకిం బిలిపించి సువాసిను లెదుర్కొని తోడ్కొని ర మ్మని యనుజ్ఞాపించిన వారలును సముచితపరివారముతో నెదుర్కొని తోడ్కొని చన నర్తకీమణు లల్లుకొనిన కనకవల్లీమతల్లికలసొంపు పరికింపుచు నగరంబు ప్రవేశించి మార్గమధ్యంబున నిరుకెలంకుల నున్న సౌధంబుల మందు విలాసినీజనంబులయొయ్యారంబులు గాంచుచు రాజమందిరద్వారసామీప్యంబుఁ జేరం జనునంత నను దేవులరా మాదిరాజబంధువులతోడం గృష్ణుఁ డనేకమందిరంబులు గడచి దివ్యప్రతికి నెదురేగి నానాసంభాషణంబులతో సభాభవనంబునకుం దోకొని చని యుచితాసనాసీనుం జేసి తక్కినవారల తమస్థానంబులఁ గూర్చుండ నియమించి నిజపీఠం బలంకరించి కుశలప్రశ్నంబు సేయ దారుకుడు నవలోకించి ప్రహృష్టుండు "దేవా! భవదీయముఖావలోక-

సకుతూహలసాగరంబున నామనం బీదులాడుచున్నది. కాని మీరు నన్నడిగిన ప్రశ్నం బాగతానాగతవేదులగుమీ రెఱుంగనిది గాదట్లుండియు నాకుశలంబు నాచేఁ జెప్పింప మీకు మన స్సయ్యెఁ గాన మనోవ్యథాభరంబుతోఁ గూడిన నాచరితంబు విన్నవించెద సావధానమనస్కులరై యవధరింపుడు.

“వజ్రనాభుం డను దానవుం డొకఁడు ఘోరతపంబునఁ బ్రజాపతిం బ్రసన్నుం జేసి వాతాతపంబులకు నహితము తనముడల లేనిదియు చోర నసాధ్యం బగు వజ్రపురం బను నొక్క నగరంబును మేరువపాంత నిర్మించి యొసంగ వరంబు వేడిన చతురాననుం డాతనితపంబున కనుగ్రతిఁ జెందినవాఁడు గావున నట్టుల యొక్క నగరంబు నిర్మించి యాతఁడు కోరినవరం బొసంగ నందు దివ్యభోగంబులచేఁ బరితృప్తి నొందుచు మొన్న చతురంగబలసమేతుండై దాడిగ నేగుదెంచి కామాతురతచే పోతరించిన యాతనిసేనల సప్పగోంగనావివరోగలాలసంబును, నవీనపుష్పపల్లవసంయుతంబును నై తనరారుచుండనసనంబన విడియించిన నానసమూహంబు లధికోత్సాహంబున మందారహరిచందనసంతానకల్పవృక్షోత్తమంబుల నవేకవిధంబుల కొనియాడలేకయు మానంబు గావించుచు గర్భనిర్భేదంబుగ నాప్పుడు నందనవనంబున కొనరించినపరిమాపం బే మని చెప్పుకొందు? నిప్పుడు సహితము నాసంగతి స్మరణకు వచ్చి నామనం బాయద్భుకసంతాపభరంబు భరింపఁజాలకున్నది. కమలాక్షి ! మఱికలంకచేఁ జెప్ప మఱచినాఁడను. త్రిభువనములందును వాని కెదిరించి పోర సామర్థ్యంబు గలసమర్థుండు లేకుండునటుల యొసంగినవరంబు గూడ వరమేష్ఠి యొసంగినదానిలోనిదియ కావున నాతఁడు పోతరంబున మమ్ము మిన్న గానక నైకి రానేను బృహస్పతిం గలసి యోజించి “యక్కచెలియుప్రసంతానం బగు మన కింత దుష్కృత్యంబు కూడదు. నీపలుకు మేమును మాపలుకు నీవును నాదరించుచు కలసిమెలసి యుండిన నెంతయు నొప్పిదంబుగ నుండును గాని దినదినప్రవర్ధమానక్రోధంబున కలహించుచుండిన నేరికైనను చేడ్పాటు సంభవింపకమాన” దని రాయభారంబు పంపించిన నది విని యాతండు కొంతకాంతము సహింప నవియ సమయం బని యప్పటినుండియు కొలంది సంబంధబాంధవ్యంబులు కలయం బలుకుచు ముఖప్రీతివచనంబుల పట్టణంబులోనికి రప్పించి వానిసేనాసమూహంబులకును వానికిని తగినవిడుదుల నొసంగిన రక్కసు లందుప్రవేశించి తమచెంగటను దంధ ననుపసైరి యని తిట్టువారును, లేమ కమ్మృతంబుఁ ద్రాగి

నిచ్చితిఁ గా నని గద్దరించువారును, మధుపానాసక్తిచే మంచిచెడ్డ లెఱుంగక కాఱు లరచువారును నింకననేకు లనేకవిధంబుల కోటకొత్తళ లెత్తిం గోరుచు సల్లకల్లోలంబుఁ జేయుచున్న సభమరాక్షసుల నందఱు నన్నివిధంబుల ననునయించుచు నే బడ్డపాట్లు వివరింప నెంచును నెవ్వరును బడియుండరు. మీ కే మని చెప్ప నెంతపాపంబుఁ జేసినజంతువో గదా యిందప్రపదవిని బొందెడు నని నామనంబునఁ బొడగట్టి నాటినుండి నేటిదనుక విచారంబు వదలఁకుండుటచే కృశించి సగమైతి కాని యీనగరీరమాసౌందర్యాతిశయంబును మీసుందరవదనారవిందసందర్శనంబును, మృగమధురవచోలాలసంబును వీఁడు మిక్కిలి లౌకికకార్యాలోచనంబులఁ దోడ్పడి నన్నుఁ దరిఁజేర్తు రను కుతూహలంబును నామనంబున నంటపింప నే నిప్పుడు కొంచె మిందుప్రనిదంపంబునఁ గాన్పించుచున్నాఁడను గాని చెన్ను దఱిగియున్నవాఁడ. మఱియు విలోకింపుఁడు. రక్కసుల నాగంబున పురంబునకుం గొనితెచ్చి పెక్కుతెఱంగుల వాపరింపుచున్నను వజ్రనాభుం డొకనాఁడు సకలసైనికనివహంబులతోడం గదలి మదీయమందిరద్వారంబుకడ కేగుదెంచి ద్వారపాలురం గాంచి వీరోజనితో మాటలాడుటకు పని గలిగి వచ్చితి మని చెప్పి లోని కనుపుటయును నేనును నాకీ తెఱంగి లోనికి ప్రవేశపెట్టుటకు తగినవారిని నియమింప వారు పోయి యుచితప్రకారంబులఁ బ్రవేశపెట్ట సమకట్టిన మెఱియలనంటిరక్కసులు లెక్కకు నెక్కుడై మిక్కిలియుక్కున క్రొవ్వియుత్సాహంబుచే వడివడిగ లోనికి ప్రభువువెంటం జనుదెంచుచు ద్వారపాలురఁ ద్రొక్కికొని నిర్భయంబుగ సభామందిరంబు ప్రవేశించి సర్వాతిరేకంబున నాతండు నాసింహాసనం బధిష్ఠింప తదీయానుచరులు నద్దియలపైఁ గూర్చుండిన మునిముఖ్యులబాహుల బలిమిం బట్టి యీనలఁ బడనైచుచు తమంతఁ దామె యాయాస్థానంబుల నలంకరించిరి. దేవతాగణంబును సంయమిగణంబును తమతమపాటునకు నిశ్చేష్టితులై గుక్కుమిక్కు మన కక్కడ నక్కడ నొదిగి యుండిరి. నే నప్పుడు వారల పాటుఁ జూచియు దానికై విచారింపక యీఖలుండు మము నిర్బంధం బెట్టిన ప్రమాదంబు నెంచి కంపింపకమానను. ఏది దిక్కని కలకఁబాఱునమనంబుతో వెలవెలఁ బోయి పైకి మది కలంకఁ దెలియబడకుండ గాంభీర్యంబు దెచ్చుకొని సేవకనికాయంబుచే పుష్పగంధవస్త్రాభరణంబులు బహుమానం బొసంగ నియమించుటకై పిలువ నాతం డాసన్నునెఱింగి సత్కలంబు చేకూరెఁ జాలు నిలు మని వారించి యున్నాఁడు.

పలసినవస్తుసంచయం బెల్ల నాయిష్టానుసారముగ ననుభవించి యథేచ్ఛగ వ్యయపఱిచి రావతికంబుఁ జేయక యొరుఁ డిచ్చునందాక తాళియుండుదైన్యంబు నా కేల? నీమంచి తనఁపునటనలచే మొగమోటంబున నూరకుంటిని గాని నీవృథాలాపంబులు నా కేమిటికి? తగవరి వైనయెడ నావాక్యంబు లాలకింపుము. మన మిరువురము కశ్యపబ్రహ్మసంతానం బగుటచే నెంతకాలంబునుండి నీ వీనాకమును పాలించుచుంటివో యింతటినుండి నే నంతకాలముదనుక నేలుట పాడి. మనము కాశ్యపుల మగుటచే దేవదానవులకు జ్ఞాతిత్వంబు సహజంబు. నీ విదియంతయు నెఱింగినవాఁడవు గావున నీక్షణంబ రాజ్యంబు మాపాలంబు గావించి యిటనుండి కదలి యెచ్చటికేనియు నరుగుము. అట్లు సేయవేని ని న్నిప్పుడ పట్టి మట్టువెట్టెద. మీ రంపలును నాచేతిలోనివారల. నన్ను జయింప మీకు బలంబు చాలదు" అని వచించుపుణ్యజనునితోడ "సంహరించుట యన నేపాటిది? నీవును మేమును పరస్పర మైత్రిం గలసిమెలసి యుండుతెఱంగు యోజింపవలయునే కాని యిట్టిపల్కులఁ బలుకుట యుచితంబు గాదు. దానవేంద్రా! నీవు వచియించినట్లు మన మిరుతెగలవారము కశ్యపసంతతి యగుటంజేసి మనవివాదంబుల నెల్ల దీర్పఁదగినవాఁ డాతండ కావున నామునీంద్రునికడ కరిగి విన్నవింతము. ఆతండు నాకాధిపత్యమును నీకొసంగు మని యానతిచ్చినయెడ నొసంగెద నంతియె కాని కారణంబు లేవైరంబుఁ గల్పించుకొని సంగరంబునకు డీకొనుటవలనఁ బ్రయోజనం బేమి? నాపలుకుల యందలినిక్కువం బారసి శాంతము వహించి మావాక్యప్రకారంబున నే యాతనికడ కేగి మనవివాదంబును దీర్చుకొనుట యుచితంబు గాని యూరకుండుట మేలు గాదు. తియ్యనినోటం జేదు మెసంగుట నీయట్టిగట్టివారలకుఁ దగినపని కాదు." అని యనేకప్రకారంబుల వాతని మెప్పించి యొప్పించి సంతసించి బృహస్పతిముఖ్యులం గలసి యాపలుకుల కొక్కఁడై వెంటఁ గశ్యపుఁ డుండునెడకుం జనిన నాపరమతపోధనుండు యజ్ఞదీక్షాపరతంత్రుండై యుండుటం జేసి తనయజమానాసనంబున న్వారి తీర్చుటకు నియమించి దానవేంద్రుని సరససంభాషణంబులఁ బ్రీతుం జేసి నీవిప్పుడు వజ్రిపురంబున కరుగు మని యుద్యోగించిన సురవిరోధియు మాయాపుష్పకంబున నాపలుకుల కియ్యకొని యటనుండి కదలి నిజనివాసంబునకుం జనియె.

తే. ఋష్యన్నపానభాగనిర్ణయ మచ్చేఁ బలిపోటికంత విడివడ్డపదంబున నారా

శ్రమము. ఈపరిభాగంబున నాశ్చర్యరసంబున కాస్పదం బై మనంబున కానందంబుం గలగఁజేయుచు న స్వప్నముఁ విని కని యెఱుంగనదియు, నిశ్చయానిశ్చయంబుల నెఱుంగ శక్యంబుగానిదియు నగునొక్క స్వప్నంబును గాంచితి' నని లజ్జచే సాంగంబుగఁ జెప్పక కప్పిపుచ్చఁ జూచినచందం బారసి యాచెలి, 'సఖియా! మనలో మన కట్టిరహస్యము లున్నను దాఁపఁ గూడ దని యెం ట్టిడుకొంటిమి గ! దేఅట్టిదియైన నిట్లేల వచియింపక మోమోటపడియెదు? మనకు భేదంబు గలుగుట విహితంబు గాదు. నుడువక తప్పదు' దనిన, నాకనకాంగి యందుల కంగీకరించి తనకల సకలంబును సకలంబు గాకుండ సౌహార్దంబున నీరీతి వచియింపఁ దొడంగె.

"హిమవత్పుత్రిక యగు హైమవతి యపారకృపాతరంగితమతి యై మందస్మిత సుందరవదనారవిందముతో నాస్వప్నంబున సాక్షాత్కరించి నన్ను బ్రేముడిఁ దనయందకుఁ జేరఁ బిలిచి దక్షిణహస్తంబున నామెయి నిమురుచు 'నోతరుణీ! నీకు నొక్కచక్కని మక్కువకాని మగనిగ సమకూర్చితి' నంచు వచియించుచు నొక్కచిత్రఫలకంబునందు విశేషరూపలావణ్యశౌర్యగాంభీర్యకారుణ్యాదిగుణంబులఁ గొమరొందుకొమరుపాయోక్కరుఁ గోమలాంగునిం గోరకదీర లిఖియించి, 'యీతండె నీవల్లభుండు. ప్రద్యుమ్నుండు నాఁ బరుప రాక్రమవంతుడు. మీయిరువురకు జనియించినపుత్రుండు దీపుఁడుంబుఁ బాలింపు' నని పలుకుటయు, నేనును నప్పటి పెద్దలచేఁ బ్రేరేపింపఁ బడినదాన నై యాయమకు వందనం బాచరించి యనిపినట్లు కలఁ గంటిని. ఆచిత్రఫలకంబు ప్రత్యక్షంబుగ నాయొద్ద నున్నది." అనుచు నాచిత్రరి తనచెలికత్తియ కీ ట్లుంచ్చుమవాక్యంబుల నాశ్చర్యజనకం బగుస్వప్నంబును వినిపించిన నదియు నాయమ చెప్పునదంతంబు సాంతంబుగ నాలకించి యాశ్చర్యముతో దల యూచి 'తరుణీ! నీ వపరిమితభాగ్యవంతురాలవు. మీజనని నీజననపూర్వంబున మేనకాత్మజ నారాధించి యామెను మెప్పించుటచే నామె నిన్ను బ్రసాదించెనఁట. నీ వనయం బామహాదేవి నారాధించుచుండుటం జేసి యామె నీయెడఁ గలకృపారసంబుచే చిత్రఫలకంబున నీ కనురూపుం డగుకన్యాకువన్యా కాని మెన్నుగ లిఖియించి యుండు. నీ కీడు వచ్చు కోడే త్తె లెవ్వ రేలోకంబునఁ గానఁబడరు. ఇంక భూలోకంబున నీ కీడెవ్వరు? పోతుంటేగ నైనను నీరసపాధ్యం బగు నీపరిదేశంబున నిట్టివింత చిత్రఫలకం బుద్భవించుట కష్టకారణంబు. ఏల యన, ఫలకంబున వ్రాయఁబడినవాఁడు [illegible]దరవిమాభవుండు. దానవులకు దామోదరుండు శతృవుచ్ఛమలోనివాఁ డగుటచేఁ

తమ్ము లేదని యనిన హెచ్చుగుచున్చరంబున మండిపడుచు ప్రభావతి దీనద్ది యని రో ర్చు టిట్లని గారిచే రచియింపంబడె నని పేరువెట్టి యతివ రూపతియు యీదుండగలు మొందితనంబునఁ జేసియుండుఁ గాని వేఱొండు గా దని ప్రథమంబున మమ్మాలం జెంది తైమ. నీవును నేనును జూచుటకొఱకు యితడు లెవ్వ రెఱింగినను మనకు నిశ్చయంబుగ మోసం బాసన్నం బగు. ఇతరు లెవ్వ రీవంక కేతెరకున్న దాని నెచ్చట భద్రపరచినదానవో శీఘ్రంబ గొని తెమ్ము. సృష్టియం దతివిచిత్రరూపంబున నెసంగు వానిని గాని సాధారణరూపవంతుని నీయట్టిసుందరాంగికి వరునిగ గారి లిఖించియుండదు. ఆవ్రాయఁబడినవాఁ డట్టివయోవిలాసంబుల నీరూపంబున కనురూపుఁడు గాఁగలఁడో కన్నులఁ జూచుటకు నామనంబు తహతహపడుచున్నది.' అనవుడు సక్కిలికి యిక్కడనె యెక్కచక్కని చిగురుంబోడయటీలింబునడుమ సుంచినదాన నని చెచ్చెరం గొనివచ్చి నెచ్చెలిసముఖంబున నొప్పుగ నప్పలకంబుకప్పు నెపలించిన, విండ్లనుబోలు బొమలచే నొప్పు మందస్మితసుందరవదనమును, తామరరేకులతీరున నున్న నేత్రంబులనడుమ నీలంబుల నెకసక్కమాడుపాపతో నేవంకనుండి చూచిన నావంకకె జూచునట్లున్నయు, గంభీరంబుగ నెదుటివారితో పలుకఁ గడంగినట్లు తనరి జీవకళ లుట్టిపడుచునుండె. చిత్తరు వన్ననిశ్చయంబుచే నెదుర్కొంచి ముఖకళ విలోకింప భావవికారంబుచే నిజాకారంబుగఁ గాన్పించి భయంబును దత్తరంబును గలఁచ ఫలకంబును దాచుచు తనివి దీరక మగుడఁ జూచుచు నితరు లీసంగతి గనిపెట్టిన మోసం బని యిచ్చట చీమ చిటుక్కుమన్నను భయభ్రాంతయై కొంతదనుక నలువిక్కులు పరికించుచు పటంబున నున్నప్రియునియవయవంబుల విస్మయాయత్తచిత్తంబున నొక్కొక్కదాని నొక్కొక్కవిధంబున నొక్కింతతడ వాలోకించుచు, 'అహా! యింతటిమనోహరరూపము లోకంబున సాధారణంబుగ నేరికిఁ గలదు? అంతిక తనచిత్రవిశేషంబును వెల్లడింప రచియింపనోపు. కాదు. తనస్సృష్టియం దీమహనీయరూప తిడువచ్చునేమొకత్తె లిఖుపమిని లేమింజేసియో యజుండు తన నేర్పరితనంబు తేటపడ నాతనికి జోడుగ ప్రభావతిని నిర్మించె. కాకున్న నీయిరువురయు వయోవిలాసంబుల నింత తులఁతూగుదురె?' అని యనేకవిధంబులం బలుకుకాంతాతిలకంబును ప్రభావతి గాంచి, 'యెక్కడివాక్యంబులు? ఇవి యన్నియు నిచ్చకంపుమాటలు గాని వేఱు గావు. వాని నటుండనిచ్చి నిశ్చయంబుగ వచియింపుము. నీనెచ్చెలితో

ఇయ్యది చిత్రవిశేషంబు గాక యిట్టిసునుం డేలోకంబున నైన నుండదేని యాతని
జాయకుఁ గాము గాని నేఁ దచ్చరణంబులకడ దాస్యంబు సేయ నర్హురాలనే? ఏల యిట్టి
'యసిద్ధయాస' లని నిట్టూర్పు పుచ్చి యాతని నచ్చికఁ బరియుక్కొ నిరూపించువాక్యం
బులచేఁ దనమనోభావంబుఁ దెటపఱుచుచుఁ దనబోటితోఁ దడవు సంభాషించుచుండునతి
సమక్షంబున సంచరించుచున్నకలంబున నాస్ఫుత్తాంతంబు సాంతంబుగ నాలకించి వజ్ర
నాభురాజ్యాంతసానసామీప్యంబు తథ్యం బని మదిం దలంచితి. ఏల యనిన,

ఆకాంతాలలామ ప్రద్యుమ్ననిజాయ యగునటులు వచియించిన కాత్యాయని
వాక్యంబులకు బొంకు గలుగనేరదు. దైత్యాధికనూజునకు నాదుష్టదానవుండు తనప్రతి
కారత్నంబును దనంత నొసంగుట యసంభవంబు. ప్రద్యుమ్నుఁ డాదానవప్రతీకి భర్త
యయ్యెనేని వజ్రనాభుని కాతనితోడ యుద్ధంబు సిద్ధంబు. వజ్రపురీరాజ్యతంత్రంబులుఁ
బ్రభావతీప్రముఖులు నదెప్పు నని నమ్ముచుండుటచే రెక్కసుల మొక్కలంబు చెక్కుచెదరి
చెక్కసంబు గాకుండును. చిత్రశాలాసంబు ప్రత్యక్షంబుగ నుండుటచే నధికవిశ్వాసాస్పదం
బగునని ప్రాచీనకాలంబున నగుటచే నవిరభావియు నని పెద్దలు వక్కాణించుచుండుయున్న
దాన. ఆయన్నులమిన్న నామగోత్రంబు ప్రభావతి యగుటయు నాఱారాలు వజ్ర
నాభునిపుత్రిక యగుటయు నవియాప్తవృత్తాంతంబు సాంతంబు నొందెనయనంతరం
బామత్తకాశినులయుక్తప్రవృత్తంబుల నీయుక్తమకథనంబు వెలుపడియె. ఇయ్యది
భగవదీయకార్యప్రకారంబునకుఁ గారణంబై తప్రహారంబునకు సాధనమ్మగా నయ్యె.
దేవకార్యనిర్వాహంబునకై ప్రద్యుమ్నసమాగమంబు ముఖ్యంబగుటచే యత్నం బతిశయంబుగ
జేయుట శ్రేయస్కరం బని తోఁచుచున్నది. స్త్రీలచిత్తంబులు చంచలంబులు. ఎల్లవేళల
నొక్కభావంబు నైకొనునవి కావు. త్వరితంబుగ నమహోనున్న విఫలంబై చెడు'' నని
యాకాపంబిని నాసభ్రనిగాపి దొలంగ సహజసారస్యవాణీరామణీయకంబుచేఁ గార్య
కారణకామనీయకంబు నినుమడింపఁజేయ నుతాత్రిముంచు తాను దలంచుకార్యానుకూలం
బునకుం డెటి నాయాచకరిపవచనవచనాదివిశేషంబు చిత్తంబున కపరిమితానందం బొసగూర్ప
హోత్కృష్టు మెచ్చుకొనుచు తా నాపులుంగువాచావివేకంబు నీవిధంబుగ నుతియించె.

«సంప్రార్థింపఁబడినకల్పవృక్షాలంబులమైత్రి యర్థసంపదలఁ బొదలఁ జేయఁ, ఘన యుక్తిశోభంబుపొంతఁ బోక, యాకాంక్షానుస్ఫూర్తితోఁ గథాకల్పనాచమత్కారముం జూపుము, పూర్వోత్తరవిరోధంబుగాని రీతి నీయుక్తి, స్వభావానస్థలతో నింపి, పరిష్కృతార్థ భావంబు పొసఁగ నమరుము, పదతతిఁ దొలఁగ నీయక, మహాకావ్యతాత్పర్యమునకు సరసపదం బలుక నేర్చు బహుజన్మకృతసుకృతపరిపాకంబునం గాక యేల చేకుర నేర్చు? ఓనగటామణి! నీవాచాచమత్కృతవిశేషంబు చూడ సామాన్యపురాయంచలచందంబు కాదు. భారతివో యామె దిద్దినకవివో యని యెన్నఁ దగి యున్నదానవు. లేకున్న నీచాతుర్యంబు తిర్యక్సంభవులకు సహజంబుగా" యనుటయు నావిహంగము «పురందరా! రెండవ పక్షంబే నిజంబు. కమలాసనునిలేమ గడపుపారంపరాహ్వయముం దనుమరాళితల్లజా పుత్రికను. భారతిచే బాల్యంబునుండియుఁ బెంపఁబడి తద్విమలశిక్షచే సకలవిద్యలం గ్రహించితి" నని తద్వృత్తాంత మంతయు వినిపించిన సునాసీరుఁడు «దానం జేసి కాద నీ వింతసామర్థ్యంబున నెన్నికెక్కి యున్నదానవు. అనంతరకార్యంబునకుఁ ద్రోవఁ గానక దీనత్వంబుచే ధైర్యంబును బాసి యున్నమాబోంట్ల నుద్ధరింప నెంచిన మాపాలిభాగ్యదేవత యనుగ్రహంబుచే నిన్ను నీరూపంబున నన్నింటికి నాధారంబుగ ననుగ్రహించి నట్టు పొడకట్టు చున్నది. ఈకార్యంబు నీవు తక్క యితరులు నిర్వహింప నేరరు. దానికై ని న్నింత ప్రార్థించు చుంటి. నామనవి నంగీకరించి దేవతాకార్యంబు నెరపి చిరకీర్తిం బొందుము. ఈకార్యంబు నెఱవేర్పఁ బకాంగనపరివారంబుతోడం గూడి యథాప్రకారంబున వజ్రపురంబునకుం జని యచ్చటఁ బ్రాక్క్రీడాసరోవరంబుల సంచరించుచు ప్రభావతితోడిచెలిమి గలుగునల నెఱింగి యావస్మైనికి ప్రద్యుమ్నునియం దనురాగ ముప్పతిల్ల నాతనిసౌందర్యగుణంబు లభివర్ణించి యాయదువరునకు శీఘ్రసమాగమం బగురీతి నెఱింగి యాయామకవ నదియుంది ప్రేమ మునుముంపఁ జేసితి వేని నొకఁ బోయినసంకేతనీలతిక పానంబులఁ బెనంగొనినచందంబున మనకార్యంబులెల్ల నెఱవేఱుటకు సందియంబు లేదు. ఎవ్వనంబున నెఱవేర్తువో యెఱుంగ రాదు. బహుజాగ్రత్త. ఈకథ సమస్తంబును జనార్దనున కెఱింగించి యాతనిచిత్తానుసారంబుగ మెలంగుట యుచితంబు. నీవు ద్వారకానగరంబునకుం జని దామోదరుని గాంచి యే నరిగితి నని తెలిపి యీ పూనిక సకలంబును నాతనికిఁ వివరింపుము. తక్కినహంసంబు లన్నియు దశదిశాహింసంబునకై ప్రయాణం బని యొందక కార్యనియోగంబున కిర్యము

కూలతం బ్రవర్తించి యీకార్యంబు కొనసాగింపవలయు'' నని నుడివి యనుపుటయు, మరాళి యమరాళికార్యంబు నెఱవేర్పం బూని సురలచేఁ బొగడొందుచు నధికోత్సాహంబున హంసపిండుతో వెడలి చని చని రాజమందిరంబు బ్రవేశించి యుపవనంబునఁ దటాకప్రాంతకేళీగృహంబునఁ జందనచారుచర్చలచే నలంకరింపఁబడి తలిరులశయ్యపై నష్టమహిషీసమేతుండై కృష్ణుండు వసియించి యున్న యవసరంబున తమ బలగంబుతో విలాసంబుగ నభంబు డిగ్గి యుపవనసరోలక్ష్మికిఁ దమశృంగారకాంతులఁ గానుకగా నొసంగుచు దవ్వుల నున్నకృష్ణు నవలోకించి యదియె యద నని హంసలసమూహంబును బాసి తా నొక్కర్తుక, రుక్మిణియంకతలం బుపధానంబుగ నొనర్చి సత్యభామచేఁ బాదంబుల నొత్తించుకొనుచు భద్ర నురటియు మిత్రవింద పూనురటియు నిరుకెలంకుల నుండి వీవఁ, దములపుటాకుమడుపులను జాంబవతి యొసంగఁ, గాళంజిఁ దాల్చి కాళింది చెంగట నిలువ, లక్షణ జలకలశంబును పాదుకాఛత్రిసమన్వితంబుగ నాగ్నజితియు సేవ లొనరించుచుండ విరాజిల్లుపుండరీకాక్షునియెడ నిలువ, మరందీపుండరీకంబు చందంబున నెలకొని పరికాళించుమానసశోకంబును గాంచి యామానవతులు ముక్కుమొగం బెఱుఁగనికీర్త్యప్రసూతువు నదియ మెఱుఁగ లేక యీవిధంబున: జెంతకు రాఁ గతంబే మని యద్భుతంబు నొందుచున్నతఱి విజితనయుఁడు దమజానిపై కేగుట రుక్మిణికి సమ్మతంబై కార్యంబు చెడు నను శంకచేఁ గృష్ణునిం గాంచి యావిహంగము "మీతో నొక్క రహస్యంబు మనవి చేయుటకై సుత్రామునిచెంతనుండి దూతగ నేఁగుదెంచితి' నని నుడివినఁ, గమలనాభుం డాయుంచగరితసమయోచితప్రసంగకౌశలంబునకు మెచ్చుకొనుచు మందహాసంబుఁ జేసి సత్యారుక్మిణులయంకతలంబులనుండి చరణముస్తకంబుల నవ్వేత్తుగఁ దరల్చి లేచి జాంబవతిచెంత నున్న నాగవల్లీదళంబులకపురంపుబాగాల నంది పుచ్చుకొనిన నతివ లందఱాసంకేతంబు నైతెంగి దూరంబుగఁ జన, హంసి కంసారిం గాంచి వృష భాసురాంబుల వజ్రి విలిఖించు టాదిగా వచటికిఁ దనపుట తుదిగాఁ దమకు జరిగినవచః ప్రసంగంబు నిరవశేషంబుగఁ జెప్పుటయు, నాతం డాకార్యనిర్వాహంబునకు వటుశిఖామణి వల్లెయని యుపకృతిగ గ్రహించి నిశ్చితాత్ముం డగుచుఁ దన కార్యానుసరణంబునకు వీడోద్యుక్తభాషితంబుచందంబున నాతనిం గడతేర్పుటకుఁ దగినసాధనంబుగ నీతఁ డేర్పడెరు కార్యసాఫల్యమునకు సంశయింపం బని లే దని సంతసం బంది శకుంతంబున కి ట్లనియె.

"అభినవబలదర్పపరాక్రమోపార్జితుం డగురుక్మిణీసుతుండు కామరూపు లగు దానవులకల్పితమాయావిలాసము నతిక్రమించుబుద్ధివిశేషంబు గలవాఁడు. ప్రభావతికి నిశ్చయంబుగఁ బతి కాఁ గలాఁడు. వజ్రనాభుం డీతనిచే నిస్సందేహంబుగఁ బరిమార్పం బడు. ఆతనినగరం బితరులు తదనుజ్ఞాసారంబునఁ గాని వేఱువిధంబునఁ జొర నను పడదు గదా! ఏవిధంబునఁ బ్రద్యుమ్నుం డాపురప్రవేశం బొనరించునో వివరించెద నాలకింపుము. మున్ను వజ్రనాభాధ్వరసమయంబున భద్రుం డనునటప్రముఖుం డొక్కఁ డరుదెంచి మఖంబుఁ జూడ వచ్చినమునివరులఁ దననృత్యప్రభావంబుచే సంతోషాంతరంగులం జేసి వారలచే సప్తద్వీపగమనోపాయంబును, నాట్యంబుల స్వేచ్ఛారూపంబు దాల్ప నారియట్ల తనవునట్లును తా నితరులచేఁ బ్రతిహతుండు గా కుండునటులును వరంబులఁ గొని యెల్లతావుల నర్తనపారీణ్యంబుఁ జూపుచు సంచరించు చున్నవాఁడు. దనుజుల కావార్తఁ దెలిపి కౌతూహలం బుప్పతిల్లఁ జేసి వానిప్రవేశంబున కియ్యకొనఁ జేసితి నేని మీనకేతనుం డావేషంబున రాఁ గలండు. అది మనకు పరమప్రయోజనంబు. దీని నాతనికడ నడపుమార్గంబును నందు వాటిల్లుప్రమాదంబులకుఁ దగినయుపాయంబులను నీవ యెఱుంగుదువు. సురకార్యంబు సమర్థింపు" మని యనుపుటయు, నాపులుగుపడంతి కులజాతులం గూడి యటనుండి కదలి గగనంబున నేగి వజ్రపురాగమనోన్ముఖం బై చనుచున్నయవసరంబున ద్వారకాపురబాహ్యప్రదేశంబున గందుకక్రీడాపరాయణుం డై యున్న ప్రద్యుమ్నుండు తనహృదయానుసారంబుగ హయంబునుఁ బో నిచ్చుచు వలయుచో పస వడి నిల్పి ముందటికిఁ బఱపి కెలంకులకు దొలంగించుచు వెనుకకు తగ్గించుచు సమయానుకూలంబుగ మరల్చి వడివడి నడిపించుచు కందుకం బుద్దీనం బగురీతిఁ గొట్టుచు నితరులు తన్ననుసరింపకమున్న యాచెండును క్రిందఁ బడనీకుండ కోలచేఁ గొట్టుచుఁ జక్రగతిని హయంబు నడిపించుచు దనచేతిరత్నమయదండముకాంతులు చూచువారికనుదమ్ముల మిఱుమిట్లుగొలుప చక్రాకారంబుగ తురంగమును బరపుచు నాట లాడుచుండె. అత్తరి రాచూలి తురంగంబు వెన్నంటి తక్కినహయంబులు వ్యస్తంబు గాక చక్రాకారంబుగ పరిభ్రమించుతఱి రథికులయాభరణములకాంతి కొఱవులు దిప్పినచందంబునఁ గానుపించె. పంచమగతితో హయంబు లోరమోముః మెలంగుచుండ వాగెల బిగియింప నిలచి వదనంబులఁ గలఖలీనములను ధ్వనింపఁ జేయుచు నురుగులను గ్రక్కుచున్నతఱి నంతకన్న

నొక్కి సాహిత్తి నొక్కి పట్టె. దనసెయ్యంపుచెలిమికాడు నైదంపు యొసంగ ప్రద్యుమ్నుండు నాయంబును డిగ్గె.

ఆయవసరంబున వియత్పథంబునఁ జనుచున్న శుచిముఖి యాతని విలోకించి నిశ్చయంబుగ వాఁడె యితండుగఁ గన్పట్టుచున్నవాఁడు. ఈమోహనాకారునితోఁ బ్రసంగించి చనుట కార్యసాఫల్యంబున కుపాయం బని యారాచకొమరునికి వినుపించుదరీతి నీడోద్యానంబులతోడ ముచ్చటించిన విని ప్రద్యుమ్నుం డచ్చెరు వొందుచుండ నయ్యంచపిండు భూతలంబునకు డిగ్గుచు నేలవాలుగ నీరముదారి పక్షంబులు పార్శ్వంబులకు నిశ్చలంబుగఁ బరపి రతిపతియంతికంబున నెంతో వింతగఁ గొంతతడవు సంచరించి యంచితంబుగ మించి పారి నెఱవుగ మెఱలి తెఱలి వారగ నొరగి మలపు దిరిగి రెయిరెక్కలు రెండు జక్కగ నెఱయఁ జాచి పుడమిపై కాలూని యెక్కార్చి మణిచి వలువంకలకుం బరికించి మొగముల నోయారంబుగఁ ద్రిప్పుకొని ఛదనంబుల నిదిర్చికొనుచు సవరించి తమబెడంగు విడంబింపఁ జేసె. అంతఁ బ్రద్యుమ్నుం డత్యంతకుతూహలంబున వానిని గాంచి "పక్షివరులార! మీలో మీరలు తొలుత నీతనితో సంభాషింపవలె నని నిశ్చయించికొంటిరి గాదె! ఇచ్చట నేవాక్యంబుల నెవ్వరితో ముచ్చటింప నలయునో యూరివిం బిలచి మాట్లాడుడు. ఎట్టికార్యంబునిమిత్త మెందులకుఁ బోవుచున్నవారో! మీర లన్యాపదేశంబునఁ గార్యవిరోధంబు సైరించి యుండరు గదా యనుసంశయంబు చేత సంకోచంబు లేక నేరిరించి యీచందంబున వచియింపవలసెఁ గాని భవదీయసౌందర్య విలాసంబులకుం దనిసి కాదు. మీయాకారగుణభావపాండిత్యములం దిలకింప దివ్యజాతి పక్షులచందంబునఁ గానుపించుచున్నారు కాని ప్రకృతిహంసంబులు గావు. కారణంబు లేక యిట్టు రా"రనటయు వంగ శుచిముఖి మృదుమధురస్వరంబున జనానురంజితంబుగ ని ట్లనియె.

ఈప్రదేశంబున నే మిరువు రెవ్వరితోడ మాటలాడ జను దెంతుము? పుష్పహాసా శునివేమోనకంబున పురుహూతమునిపాలి కేతెంచి యాతనిచే వీడ్కొలుపంబడి తదాజ్ఞానుసారంబున వాయువుసయుష్టామసారం బగుకార్యంబు రయంబున నెరవేర్ప నేఁబోక నోటికి నేగుచో ప్పృద్ధి యయ్యూను నీవంటిసుగుణమణి నవలోకించి కొలఁది వింటుకు నేయుట యుచితంబు గా దనియు సత్పురుషులసేవ శ్రేయస్కరంబున కాలవాల మనియు నీయనుగ్రహంబు కార్యసాఫల్యంబునకు మూలాధారం బనియు నెంచి యతిక్రమించి పోఁజాలక నీసన్నిధానంబున కేతెంచితిమి.

నీవు వచియించినవిధంబున మేము త్రిపథగావిహారలాలసుల మగు
రాయంచలము. రుక్మిణీతనయా! ఏవిషయమునందైనను నీమాపునకుఁ దప్పు గలుగునా?
మేము కార్యపరుల మగుటచే మము జిష్ణుండును మీజనకుం డగువిష్ణుండును మాయెడ
నావంతయును సంకోచము నందక యెట్టికార్యంబున కైనను నిట్టుల నియోగించి పంచి
నడుపుకొనుచుందురు. నీ వనఁగ జనార్దనుం డనఁగ భేదము లేదు. కాన నేను బోయెడు
కార్యంబును నీవంటియోగ్యునకు విన్నవించిన దోసంబు కా దని యాయేకాంతంబు
విన్నవింప సాహసించితిని. మే మిచ్చటఁ బ్రసంగవశంబునఁ దడయుటకు వీలు కాదు.
మేము పోయి వచ్చెద" మనిన బ్రద్యుమ్నుండు "మీ రరిగెడుకార్యం బేరికి నుడువ
వర్ణ్యంబు గా కున్న పోనిండు. అంతం డె యితం డనుకొంటిరి. పూర్వ మాప్రసంగం
బెచ్చట నేకారణంబునఁ దాఁ గారణంబు గలిగె. అది యైనను వచియింపఁ దగినదేని
ప్రయాణంపుజాగు వికారంబు సంభవింపఁ జేయు దేని వినుపుకొనక సాయం
దనుగ్రహించి నిమేషం బాగి వివరింపు" మనుడు నాయంచగరిత "రహస్యం బైనదియు
వచియింపఁ గూడనిదియు నగు. భవదీయప్రశ్నంబున కనుగుణం బగుప్రత్యుత్తరం
బొసంగ కుండుట మేలు గాదు. నీవు మాధవపుత్రుండ వగుటఁ జేసి నీ సందేహ
నివృత్తికై మేము పోయెడుప్రయోజనంబును నీప్రసంగవిశేషసౌభాగ్యంబును వివరించెద
నాలకింపు" మని వచియించి నుంకించి శంకించినలునంకలకుందిలకించినదానినూఁచనగ్రహించి
మానకేతనుండు తనపరివారసముదాయంబునకు సన్న సేయ దానివెంబడి పరిజనపరిహాస
కాదిబృందం బాముఖవికాసోచితంబుగ వడివడిఁ గడు వెడమగఁ గదువ, నంత రాయంచ
గంతు నుపలక్షించి పంచదారను మించుతినమంచిమాటలసంచు నంచితంబుగఁ గాంచి
సంతసించుట నెఱింగి "కందర్పా! వజ్రనాభుం డనుదనుజాని వధియింప బహుదినంబుల
నుండి యింద్రుఁడు మహేంద్రుఁడు బ్రయత్నించుచున్నవారు. తమకంటె ముందుగ వాఁ
డేమి కీడు మూడఁ జేయ నున్నవాఁడో కడు వడి నెఱింగి వేగ నడప నన్ను
నియమించుటచే నే నిప్పు డచ్చటి కఱిఁగెద" నని వక్కాణింప విని యాతం "డాహా!
యీకార్యంబు దుర్ఘటం బైనదిగ నెంచి వారియవుర భీతిల్లుచున్నచందంబు గానిపించు
చున్నది. మే మున్నసంగతి మఱచిరా లేక నిర్వహించుసమర్థత మాయెడ లే దని
తలఁచిరా? ఏల వీరి కీవట్టి? ఇది యేపాటికార్యము? తమహితంబు తా రెఱుంగరు కాని
యెందులకు నొక్కరుని నియమించినవో నిమేషంబునఁ దమనియోగంబుచే నావలుగు

రక్కసియు నొక్కఁడ గింప కుందువా?" అని పొంకంబుగ బింకంబు బ్రాఁక, ప్రద్యుమ్ను నవలోకించి శుచిముఖి యంతరంగంబున నుప్పొంగుచు "నిం్రదమాధవులచే నవయంబు బిట్టుగ గట్టిమోజనముఁ జేయఁబడుదానవుం డెట్టిబలాఢ్యుండో యనికోచవాఁడు చందంబున డెందంబున మందంబు నొందక ధీయుండ వైన నొక్కనిఁ బంపిన వాని నంతంబు నొందింతు నని పలికిన నీబంటుతనం బెంతయు వర్ణనీయంబు. రణశూరుండు తనతో నెనదియ్యక సమానంబుగ యుద్ధంబు జేయ సమర్థుం డగు పోటుబంటు జాణతనంబునకు కౌతుకంబుఁ జెంద కుందు నే? నీ వయ్యసురేంద్రుతోడ సమరంబుఁ గావించుట యుచితంబె. యోగ్యులయోగ్యం బగు కయ్యంబున కియ్యకొనరు గాని సహాసికంబుగ నుండ లేని తమంతఁ దామె యుద్ధంబునకు సిద్ధం బగుదురు. ఇదియె గదా వివేకి యండ లేనిబిరుదముగలలక్షణంబు. అది యటుండ, నీప్రసంగంబు మున్ను వచ్చిన తెఱంగు వివరించెద నాలకింపుము.

కొండొక కాలంబునుండి యనారతంబు వజ్రపురంబున కాపురంబు నై యేమరుగుచుందుము. ఒక్కనాఁ డాపురీపరిపాలనాధ్యక్షుం డగు రాక్షసునిపుత్రిక యంతఃపురసామీప్యవిహారవనవృక్షచ్ఛాయల స్వేచ్ఛావిహారలాలస యై యొక్కలతాకుడుంగంబున వయస్యలతోడం గూడి బహువిధంబుల రసోదంచితసల్లాపంబు లాడుచున్న యవసరంబున, నాయున్నలమిన్నం గాంచి తీక్ష్ణదృష్టి నయ్యె నమందానందకంపలిత హృదయారవింద నైతి. ఆవధూసౌందర్యసౌకుమార్యంబు లేమని వర్ణింతు? అవిశేషంబు వర్ణింప నావిద్యాచాతుర్యంబు చాలబాటొంపక మాన దైనను నాచేర్పుకొలంది వర్ణింతు నాలకింపుము. అజపరాలి దేహకాంతి జాసవాపసించిని నిరసించుచుండ మందస్మితేనుందరపదనారవిందంబున కందం బగుచందంబున నాసాభరణంబున నెలకొని యున్నయాణిముత్యం బుత్తరోష్ఠంబుపై నటియింప, శ్రీకారంబుల కిర కర్ణంబుల నమర్చినరత్నభూషణంబులకాంతి చెక్కుటద్దంబులఁ దిక్కరింప, నింద్రనీలంబుల నపహసించుముంగురులు లలాటపార్శ్వంబులఁ జిందులాడ, రక్తవస్త్రంబు కపోలంబులపైఁ జెంగలింపఁ, జందనాగరుచర్చలపరిమళంబుతోడం గూడి దేహసౌరభంబు వెలువడి పక్షిణీజాతి నిరూపణంబు చేయుచుండె. ఆమోహనాంగిగాత్రమాధుర్యసుధారసధారల జెన్న వాగ్దేవతోపాసనాపుణ్యంబున నాచెవులు వాలవడినట్లు పొదకట్టె. నవలం దలంచిన మాకును బరాభవంబు సిద్ధించక మానదు. శరీరవృత్తాంబు కేవపుష్పంబుల

నిరసించు. శుకశారికావాదంబును మీఱుపలుకులును, చిలుకంపుచెలువలం గేరునూగారును రమణీయవర్ణాంగంబును గలిగి మెఱయుచుం ద్రిలోకసంస్తవనీయం బగుచున్నది. ఈయంశం బెఱుంగక సరసాగ్రేసరు లగుకవికులశ్రేష్ఠు లొకవేళ శృంగారరసప్రధానం బగునట్టుల నెట్టివస్తువులతో నామెయంగంబులఁ బోల్చి వర్ణించినను హాస్యాస్పదంబుఁ బొనరించుట యగును గాని పొగడుట కాదు. ఒకవేళ నాకలోకవాస్తవ్యు రా లగురతిసతి యాకాంతాతిలకంబున కీ డగు నని చెప్పినఁ జెప్ప నొప్పును గాని మానవలోకసంచార తిర్యగ్జంతుసమవయోవైభవ యనియుఁ, గ్రూరవ్యాళసదృశరోమాళి యనియు వచింప, నీచోపమ యగుం గాని స్వభావోక్తి గాదు. ఆయమృతంపుఁబొం, ఆసొగసులదీవి నభివర్ణింప శేషుని కైన నలవి కాదు. అతిత్రిలోకసుందరియవయవంబుల నభివర్ణింప మానవులోపుదురా? అట్టియెడ నాకంటెతిర్యగ్వనిత యీయంశంబు వర్ణింప బూనుట మిక్కుటం బగునాయాసంబునకే కారణం బైనను నానువతిశృంగారవాహినిలో నీకంటెమోహనాకారుం డీరేడుమండఁ జూచువారలకి నుడమ్ముల కెంతయు కొప్పిదంబుగ నుండు ననువమ్మికచే నాయసమానవిలాసంబు వేఱువిధంబుగఁ జెప్పఁ దెలివి సిద్ధింపమిం జేసి స్థాలీపులాకన్యాయంబుగఁ జేటతెల్లంబుఁ గావించితి. అంతియె కాని వేఱు కాదు. అపూర్వశృంగారకళావిలాసంబుచే నొప్పుపటువూర్ణావయవంబులఁ బ్రపంచానుభవపరిజ్ఞాతలు సహితము డోలాయమానమానసులు కాఁ గలరు కాని యాయవయవసౌకుమార్యసౌందర్యం బీవస్తుసముదాయమున కీడు నచ్చు నని నిశ్చయింప లేరగు. ఆపద్మగంధిని పద్మభవుండు నేరకేఁటిపసిండిధాళధళ్యంపు లగ్గును, వెన్నెలతేటనిగ్గును, యరవిందమృదుత్వంపుజగ్గును పొదివి యమృతంబు పదునిడి తనహస్తనైపుణీవిశేషంబు బయల్పడ నిర్మించెఁ గా కున్న నింత విడంబించునా? ఇట్టిరామణీయకం బెందును గాన రాదు. నాపరిజ్ఞాపరిభావంబున నావర్ణనీయవయవసౌకుమార్యంబు వర్ణింప లే కుంట సామర్థ్యంబు లేమిం జేసి కాదు. నన్ను భారతీమతల్లి వాఙ్మహిమంబునఁ దనయంతటిదాని నొనరింప నిచ్చవోవమి హంసవంశావతంసుం డగు సారంగసుం డనునాజనకుని రావించి నన్ను దనయొద్ద నుంచున ట్లొడంబరచి మున్నుగఁ జెనుపఁ బెఱుగుచు నాయుమప్రసాదంబున సమస్తవిద్యలసారం బెఱింగి సమయానుకూలవచస్సందర్భంబున వదలుచుండునాముఖ్యాక్షనోపలక్షి శబ్దసౌష్ఠవపూరితం బని గ్రహించి నాకు శుచిముఖి యని నామం బిడిరి

నిచ్చ కుదిరినకతమ్మున నేమియుం దోచక నిత్యంబును మేలు కోరుమిత్రులవర్గంబులకుఁ బ్రత్యుత్తరంబు లొసంగక యఖిలబాంధవనివహంబులఁ బలుకరింపక సేవ సేయుటకై చెంగటి కరుదెంచిన సేవకులసేవల కైకొనక భోజనంబునకు సయితము యుక్తకాలంబునం జనక యనయంబు పరాయత్తచిత్తంబున వర్తించుచు నంచగరిత మించ వచించినరూపవిశేషంబును మనంబునం దలంచుచు ననుపమానగహిత మైనయాదానవరాజపుత్రికమనోహర తనూవిలాసభాసురంబు మఱపు రా కుండుటం జేసి మనంబు మరలింప నేరక పక్షివచనంబులు లక్షణలక్షితంబులుగ నెంచి యంగలక్ష్మలక్షణంబుల కానందించుచు నాశృంగారవతీసౌందర్యంబు హంసాంగన నుడివినదానికన్న వేయిరెట్లెక్కుడుగ నెంచి యారూపంబును బదింబది స్మరించుచు నాయనసూయస్థితి కచ్చెరు వందుచు నిశ్చయంబుగ నాతామరసాక్షిరూపం బెయ్యదియో యయ్యదియె మనంబునం దోచిన నబ్బి తబ్బిబ్బై సుఖమబ్బుఁ గదా యని యెంచి యంతమే లెటు లగునని వితర్కించి నిట్టూర్పు విడిచి యాలేమను జూడనిజాణాజన్మంబు నిరర్థకం బని తలంచు. తలంచి యుపాయాన్వేషణంబు గావించి కుందు. కుంది ఫలసిద్ధింపని నేమికార్యం బని వెతలం బడు. వెతలంబడుచుండు నవసరంబునం బలుకరించినవారిపై నలుగుచు నెవ్వగలం దగిలియుండు.

ఇట్లు విరహావేదనాదోదూయమానుం డగుచు జనార్దనతనూజుం డొక్కనాఁ డుపవనంబునఁ జంద్రకాంతశిలావేదికపై నాసీనుం డై హస్తన్యస్తకపోలుం డగుచు నేకాంతంబున ని ట్లని వితర్కింపఁ దొడంగె. "కనులం దిలకింప కున్నను గుణరూపంబులవర్ణన నాకర్ణించినవెనుక నాకాంతాలలామంబును గోరి చింతింపక మనం బె ట్లూరకుండఁ గలదు? మనమున కగోచరంబు నసాధ్యంబు నగుకార్యం బైనను వర్ణనాకర్ణనంబునం జేసి మదీయమానసము నవ్విధంబుఁ జేయుచున్నది గదా! ఆహా! ముక్కుమొగం బెఱుంగని యాతరుణీరూపంబును నాయెదుట వర్ణించినంతనె మనంబున కెంత యాతురత వొడమెను? పొడమినవోఁ జేకూరునా? చేకూరినను జేకూరకున్న నిది న్యాయమా? అనుంపరాంగి సుందరవదనారవిందం బు నయనారవిందంబులఁ జూచుభాగ్య మేనాటి కైన నాకుఁ జేకూరునా? అది దుర్లభంబు. ఏల యనఁ దత్పురం బాయసురునియనుజ్ఞ లేనిదె చొర నసాధ్యం బఁట. అట్లు పోఁ గలిగిన నావిలాసవతిం దిలకించు టెట్లు? చూచెద నను కొందము. కనుపించినవెనుక సంభాషింపక తాళఁ గలనా? తాళలే కున్న మోసం బగును గదా! ఆమానవతి నన్నుం దిలకించి నా కనుకూల యగునా? కా కున్న బ్రతుకు టెట్లు"

అని యనేకవిధంబులం దలపోతలకుం జొచ్చి “అంచగరిత వచియించుతరి పావంపులజ్జ పైకొనం గోరిక మాటుపరచి నేను పట్టివారతనంపునీటుం బ్రకటించితి. అంతియే కాని యాలేమసమాచారము సావధానంబుగ నడిగి తెలిసికొన నైతిని. దానంజేసి యనాదరంబుం జూపితి నని తలంచి యారాయంచ వేగంబ యిటనుండి కదలినట్లు తోచెడిని. పరనులు రుచియింపనిప్రసంగముల నుడువం బోరు గదా? హంసి నాయెదుట నాముద్దియను వర్ణించిననాటనుండియు నామనం బానుంబరితయందుం దగులంకొని మరలింప సాధ్యము గా కున్నయది. అదియునుం గాక నారూపంబున కనురూపపుపురుషరూపం బాజవరాలిహస్తంబునం గలచిత్తరువునందు లిఖియింపంబడి యుండినట్లు చెప్ప విని యుంటిని కాని సమానాకారంబు గలవా రండ[illegible] గానంబడుటచే నావచనంబు విశ్వసింప వీలు లేదు. నే నాప్రసంగంబున నింమక చన వొసంగిన మరాళి యాదనుజేంద్రకన్య నన్ను వరించునట్లు చేయు ననుట కేమియు సందియంబు లేదు. లే కున్నం బ్రసంగవశంబున నాచెలికాండ్రరూపంబుల నాసన్నిధానంబున నేల [illegible]ంచును? అద్భుత రమణీయరూపయవ్వనాదుల రసికాగ్రగణ్యులు ప్రసంగవశంబున రసోదంచితంబుగ వాగ్ధారాపరిభావంబున వర్ణింపక మానం జాల రని భావించిన నకారణంబుగ వనితావర్ణనంబుం జేయుటచే నేదియో కొంత వింత సుస్తం బై యుండియుండు. అటు గా కుండినం గేశవము దినూపనులకు మాత్యంబు నేప్రము వారియనుమతంబునం గార్యాంతర్వ్యాప్తి నై చనుచున్నమరాళి తనంతటం దాను జనుదెంచి పోయెడుకార్యంబు తెరంగుం జెప్పుచు నం దొక్క లేమను వహో విధవంబునం బొగడుట మదీయమనోభీష్టంబు నెఱుంగుటకుం గాని వేఱొకకారణ ముండును? దానవిదార్థంబు న న్నునుప్రయోజనంబు జరుగుచున్నట్లు పొడకట్టుచున్నది. హంస ము న్నారాక్షసపరితాపంబుం జెప్పునప్పుడు నే నాడినవీరాలాపంబులకు మెచ్చి దామోదరునకు దక్షిణభుజం బనం దగినవీ వాతని సంహరింతు వని పలుకుట సహజంబె యని నన్నుం గొనియాడె. ఇవి యన్నియు నైకకంఠ్యముగ నున్నకారణంబున నా కాలేమయం దాశ జనించుచున్నది. నారూపం బాపారసాక్షిహస్తగతం బగు చిత్రఫలకంబునం దుండుటం దిలకించితి నని హంసావతంసంబు నుడువుట వింటి. నారూపంబు నెవ్వరో నిర్దిష్టంబుగ నెఱింగి వ్రాసియుండు రని యూపేక్ష చేత మన్న ధవానిచే వ్రాయంబడె నని వచియింపంబడియె.

ఏక్కారణంబున నాయమ మదీయరూపంబును రచించి యామె కొసంగి యుండునో? లేక యితరులచే వ్రాయఁబడి పైవ్యాజంబున నొసంగఁబడి యుండునా? ఈకార్యంబున కం దెవ్వరు సాహసింతురు? అంతఃపురకాంతల కిట్టిది భర్తృమూలంబునం దక్క వే రెట్లు చేకురు? ఆఫలకంబు విలాసార్థం బగునాటకసూత్రుగఁ బరిగణింపఁబడునా? ప్రేమాతి రేకంబున పార్వతిచే నియ్యఁబడె నని పరమామోదంబుచే నాసుందరి చూచుచుండె నని వింటి. అది యెట్లు పేక్షణీయం బగు! ఉమ తనచే సృష్టింపఁబడినబిడ్డయభిప్రాయంబున కద్దంబుఁ దలపెట్టునా? ఇది యంతయు నిక్కువంబా? నిక్కువంబు కాకున్న విరించి యామె తనసృష్టియందలిది కాక యుమచే సృష్టింపఁ జేయఁబడె నని ప్రసంగవశంబున వచియింప వినియున్నదాన నని కాదంబకాంత పలుక, మామాటంబున నాసుందరి యేసుందరాంగునకై యామెచే సృజియింపఁబడెనో తెలిసికొనక ముందు బుద్ధి నైతి నని వన్నిప్పుడు దూరుకొన్నఁ బ్రయోజనం బేమి? వరటాలలామం బావిలాసవతి వ్యసనా విశేషంబు నగ్గడించుపట్టున వేలకొలఁది ప్రశ్నావసరంబు లుండిన నొక్కదానిఁగూర్చి యైనను నే నడుగ కుండుటను గ్రహించి యిచ్ఛావిరహితుండ నని యూహించుచుని చెంగట నీప్రసంగంబు రా నెఱుంగనివదంబున నుండునే కాని యేమి వచియింపఁ గల్గుదు? తా నీయంశంబు ప్రశంసించువసరంబున నే నొక్కయిష్టవచనంబును బలికి మిన్న కున్న నెన్ను గాంచి తా నచ్చటి కేగుట నిష్ఫలం బని చని మానునో, లేక పోవునో, ఎవ్వ రెఱుంగుదురు? దైవకృతంబుఁ దప్పింప నెవ్వరితరంబు? ఎట్లు జరుగ నున్నది యట్లె జరుగును గాని విచారించిన ఫలం బేమి? ఒకవేళ జను నను కొన్న నాయభిప్రాయంబు విని కని యెఱుంగనిమహామతి యెఱుంగనివిషయంబును గూర్చి యాచేడియ కడ నేమి వచియింప నేర్చు? "అపరిషిద్ధ మయుదకం భవతి" యనులోకోక్తి యెఱుంగ కుందునా? అటు పోవఁ గార్యంబు లేక యుండినను బహువిధవ్యాదుష్ప్రాప్య యగునాపడఁతుక జాడఁ జాలక తాళఁ గలనా? కన్నకాక్షంబునను యామూర్తినిఁ జూడఁ గుతూహలము నొందుచున్న నన మనస్సొక్కరిఁ జూచియున్న కాలమాని యాలేమను మరల చూచుకుంత సహింపఁ గలనా?"

అని యనేకప్రకారంబులఁ బ్రద్యుమ్నుండు మనస్సంకల్పసామర్థ్యంబున నామాని నీమణిమధురాకారంబు మఱపు రాక వేధించుచుండుటం జేసి మనశ్శాంతికై వనవిహారంబునకుం జనఁ దనచూడ్కికి నన్నంతయుఁ బ్రభావతీయాకారంబుగఁ గానుపింప మనోవికారవిభ్రమముచేఁ భ్రాంతుండై "హంసి నిర్హేతుకకృపారసంబునఁ దనకుఁ దానరుదెంచి హితవాక్యములు పలియింప గంభీరంబున నంతరంగం బెఱుంగఁబడ నీయక మాటు పరచిననిర్దాక్షిణ్యాన కట్టిమందరాంగిపొం దెన్నటికైన లభించునా?" యని తన్నుఁ దానె దూఱుకొనుచు "నాలేమ నాకు సంప్రాప్తం బౌ సమాచారము నటుండ నిచ్చి హంసిని జూడఁ గలభాగ్యంబు గలుగునేని నాయదృష్టం బింతంత యని వర్ణింపఁ జాల. ఏవిధంబున నాజాలపాదంబును జూడఁ గలుగుదు? నునాసీరుసమాచారంబు గోవిందున కెఱిగించు నెపంబున నేతెంచి ప్రభావతీక్షేమసమాచారం బించుక యెఱింగించి యాహంసి నాకు శ్రవణానందము కావింప కుండునా? ఆకర్ణనంబునకె నామనంబు మితిమీరినవిరహంబుచేఁ గరంబు కుంగుచున్నదియె ప్రత్యక్షం బగుచిత్రఫలకంబు నపేక్షాపూర్వకంబుగ నుపలక్షించు నాజవరాలిమనం బెంత వేదనాభరంబున వెతలం బొందుచున్నదియొ యెఱుంగఁ జాల. ఆమెయెఱుంగుబోఁడికడకు మరాళం బరిగి తాను నాతోడ మాటలాడుటయు నేనభావంబుఁ జూపుటయుఁ దెలుప నాలేమ యాస లేమిం జేసి గాసి నొంది యెట్టికార్యంబునకు సాహసించునో కదా! ఏమి చేయుదు? విహంగము దివస్పతిపంపున మరల నిచ్చటికరుదెంచు టెన్నఁడు? దానిచే నాయభిప్రాయం బాకలికంటికి వాక్రువ్వఁ బంపుటెన్నఁడు? అంతవఱక నాప్రాణంబులు నిలుచుట దుస్తరంబు కాన నాసమాచారంబు తత్క్షణంబ యంచగరితకుఁ బత్రిక రచియించి యాహరిణాక్షికడ వివరింపఁ బంపుదుఁ గాక" యని నిశ్చయించి యటమీఁది కడలిచని శుచిముఖిపేర నొక్కపత్రిక లిఖియించి యేరిచేఁ బంపుటకును దోఁచక డోలాయమానమానసుం డై యుద్యానంబునఁ దనలోఁ దాను వితర్కింపఁ దొడంగె.

"ఈలేఖ నచటి కేరీతిఁ బంపఁగలను? ఎవ్వరిని బ్రార్థింతును? అచటికి బోఁగలవారెవ్వరు? ఆపురం బీహంసిచేఁ దెల్పఁబడుట దప్ప నెప్పుడు నెవ్వరిచే నుదుటుంబడకపోవుటచే నాపురం బెవ్వ రెఱుంగుదు రని నిశ్చయింపఁ గలను? నాప్రయాసం బంతయు నిష్ఫలంబె. విధను బ్రయత్నించి చూచెదఁ గాక" యని యుపాయాంతరంబున కరిగి విరహాసలతప్తమానసుం డై యుక్తాయుక్తవివేచనం బడుగంటుటం జేసి చేల నై యాపురం బా

సౌరవిందయము నై కొంతతడ వనేకభావంబు లాసహిల్లఁ జూచి చూచి సంతోషాంబుధి నోలలాడి మనంబునకుఁ దృప్తి లేకుండుటచేఁ బలుమాఱుఁ జూచి మఱియుఁ గనుఁగవ నరమోడ్చి సాక్షి "యిట్టిసుందరాకారుం డెన్నఁడైన నుండెనేని యాతండు నన్ను జేకొన నియ్యకొనిన నే నెంతయు ధన్యురాల నగుటకు సంశయంబు లేదు. ఇట్టిసుందరుని వరునిగఁ బడసి సుఖియించునాతీరత్నంబు జన్మము జన్మంబు కాని యితరులజన్మ మొకజన్మమా? అది తటస్థింపదేని నాజన్మ మేల కాల్పనా! అతం డేకపత్నీవ్రతుం డై వివాహితుం డైనయెడ నాగతి చితియో కూపమో విషమో త్రాడో నిశ్చయింపఁజాల. నిజంబు తెలియుదనుక నేమి నిశ్చయించుటకును వీలు లేదు. దైవము శరణ్యం బగుఁ గాక! దాక్షాయణి యట్టివాఁ డైన నేల వ్రాసి నీపెఱయుఁ దగు నని చూపు? ఇది యంతయుఁ జిత్రంబుగఁ గానుపించు చున్నది. ఇంతకు నావ్రాఁతఫల మేతీరున నున్నదో తెలియఁజాల." నని నిట్టూర్పు విడచి మనోవేదనాపాలనుచుఁ దన చెలితోడ నీవిధంబున వచియింప నుపక్రమించెను. "చెలీ! భవానికి నేను సపర్యలు సలుపునవసరంబున నెట్టిలోపంబు జేసితినో దానికై యామె నాకీ మనోవేదన గలిగింప నోపు. లోకంబున నిట్టివిలాసవంతుండు గలఁ డని ఫలకంబున రచియించి యొసంగి నన్నలమటపాలు చేయుట కరుణాంతరంగిత యగుశంకరురాణికి విహితం బె?" యని వచించునవసరంబున నాపలుకుల నాలించుచుఁ బ్రాంతంబున నె విహరించుచున్నశుచిముఖి యాకాంతాతిలకంబుతోడఁ జెలిమి యొనరఁ జేసికొనుట కిదియె యదను అని మనంబున నూహించి యుపాయాన్వేషణంబు గావించుచు నాలేమయెదుట మంటపమునంబున నిలునటు నడయాడుచు ప్రభావతిహస్తగతం బగుచిత్తరువు నిలకించుచు నొయ్యారంబు గులుకుసరసకలతోఁ జెంత నుండి ముందునకుం జనుచు నోరగ మోర వంచి చూపును పలకముపైఁ బఱపుచు సంచరించుచున్న నాయంచగరితం గాంచి ప్రభావతి తన ప్రాణసఖి కిట్లనియె. "హంసగమనం బెఱుంగనియాపులుంగు తానే మెఱుఁగుదు నని యీపలకంబుపై దృష్టి నిగుడించుచున్నది?" యని వచియింప, నావేడియకు నాపులుంగు వసంతి విని మధురవాక్యంబుల నిట్లనియె. "వసంతీ! మాబోటితిర్యగ్జంతువుల కేమియు దెలియనిమాట సత్యంబె యైన నీహస్తంబున నెలకొనినచిత్తరువును నత్యాశ్చర్యంబునఁ జూచుటకు కొండొకకారణంబు గలదు వినుము. మున్నొక్కప్రదేశంబున నొక్కపురుషాకారంబును గనుఁగొని యుంటచే నిశ్చయంబుగ నాపురుషునియాకారం బింత రచియింపఁబడినదియు లేక తత్సమానరూపంబు గలవేఱొక్కమానవునియాకారం బిందు లిఖి

యిందేఁబడినవియో యని నావీక్షణంబును దానిపైఁ బఱవఁ గారణంబు గలిగె'' ననిన నాలించి సంతోషాద్భుతసందేహంబులు మనంబున మల్లడిఁ గొన, ప్రభావతి పులుఁగు నను లక్షించి «యేమేమి!! మఱియొక్కసారి వచియింపుము. ఆమహానుభావునియాకారంబు నకును బటంబునం గనఁబడుచున్నరూపంబునకును నేమైన భేదంబు కలదో లేదో చెంత కరుదెంచి పరికింపుము. సరసవాక్యసందర్భసామర్థ్యంబు గలిగిననీవు మహానుభావురాల వని నామనంబునఁ బొడగట్టుచున్నది. అట్టినీవు మామనంబులఁ గని పెట్టఁజాల కుందువా? హంసీ! చెంత కరుదేర భయం బేల'' యనిన నాపులుంగు ప్రవ్వబోడిని విలోకించి «యేను మీవంటివారి చెంగట కరుదెంచుటకు భీతిల్లుదానఁ గాను. మీచే నాకు భయంబును లేదు. కాని యిరువురు చెలికత్తియలు మంతనంబున నేకాంతం బాడుకొనుప్రదేశంబునకుఁ బిలువ కుండ నచ్చుటకు నే నంత వెఱ్ఱిదాననుగా'' ననిన ప్రభావతి నివ్వెఱ గంది తానును రాగ వల్లరియును మొగమొగంబులు చూచికొని నగుచు నవ్వాక్యంబులు వీనులకు విందొనర్చి యమందానందంబును డెందంబునఁ జిందులు ద్రొక్కుచు సుందరంబుగఁ గానుపించు టచే సంభవించినయాశ్చర్యంబున మగ్నలై . యాయంచజయానవాక్యాలాపంబునం గలమిక్కుటం బగుబుద్ధులు ముద్దు . లొనఁగూర్చుచుండ, రాగవల్లరి «యీవిశేషం బశేషం బేశృంగారవతులయందును విని కని యెఱుంగము. భూషణం బైనదీని భాషణంబు లెంత గంభీరంబులో విలోకించితే'' యనుచు ప్రభావతితోఁ బలుకుచు నాయంచపై మించినదయ నించి కాంచి «యోపులుగులకులంతీ! నీపలుకులు నిశ్చయంబుగ మెచ్చఁ దగియున్నవి. మక్కువచే మిక్కిలి యక్కఱపడి చక్కఁగ వేడు కున్న ముద్దియలిద్దఱు ముచ్చటించుచోటునకుఁ దెలివితేటలు గలబోటు లేటికి బోయెదరు? ఇది యట్లు కాదు. మే మిరువుర మొకసంశయంబు దీర్చుకొనుటకై నిన్నింతగఁ బ్రార్థించుచున్నారము. నీ వింతకు మున్ను విలోకించితివి నన్నచెలువునియొప్పును యీచిత్తరువున వ్రాయఁబడినచొప్పును నొక్కటి యగునో కాదో యిచ్చెంత కరుదెంచి విలోకించి నిశ్చయించి చెప్పుము. ఇప్పు డిప్పుడుదు నేను నిట్టినుండయుండు కలఁడు లే దనువివాదంబునఁ బన్నిదంబు పన్నియున్నవార మనుటయును, నాయంచ యిట్లనియె.

"సందియంబున కైన నేమి? మఱి యేయితరకార్యంబున కైన నేమి? దానిం దెలిసికొనుట నా కావశ్యకంబు గాదు. మీకు నావలనఁ గావలసినకార్యము విచారించి విన రించెద" నని పలికిన, శుచిముఖివాక్యంబున కాపదంతులు దీనిభావం బెంతగూఢం బై యెంతసారం బరుగుచున్నది యని తలంచుచుండ, నాహంసి కొంతచేరువకుం జని విమర్శన పూర్వకంబుగ నాయాకారంబును బరికించి చూచి 'యౌ నిది యాతనిరూపంబె; యిం దణుమాత్రంబును సందియంబు లే' దనుటయు, రాగవల్లరి పరమామోదంబున నాయంచదజ యానయుం డపకుం జని మెండగుగౌరవంబు నిండారఁ దనరెండుహస్తంబులం జాఁచి దాని రెండుపక్షంబులపై నిడి యొత్తి కడుంగడిం జని ప్రభావతిదండ నిడి యల్లనల్లనఁ దనకొన గోళ్ళ నాతనూరుహంబుల సవరించుచు నంచ నుద్దేశించి "యోపుణ్యవతీ! కరుణాయత్త చిత్తంబున మూర్తిమంతముం గాంచి మమ్ము రక్షింప నేతెంచినభాగ్యదేవతవు గాని యంచవు గావు. మదీయవాదమును నేఁడు గెలిపించితివి. ఈమానినీమణి యిట్టిమనో హరాంగుఁ డేజగంబున నుండియుండఁ డని నాతో గట్టిగ వాదించుచున్నయది" యనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి "రాగవల్లరీ! నీ వేల వేగిరించెదు? ఔ నని నంతమా త్రంబున నె యీప్సితార్థసిద్ధి యగునె? తాను దిలకించినపురుషునిలక్షణంబు లే మైన నీచిత్రమూర్తియందుఁ గానిపించుచున్న వేమొ యడుగు" మనిన హంసి చిత్తరువును నిరూపించి ప్రభావతి నుద్దేశించి "యిం కేమి కావలయు? అల్లవిగో! రతికంకణాంకము ద్రలు మెడయందు గనిపించుచున్నవి. సకలావయవపరిపూర్ణశృంగారవేషంబున రంగారు మంగళవిగ్రహునియాకారంబు నెవ్వరో చక్కఁగ నెఱింగి వ్రాసిరి. ఈలక్షణయుక్తుం డగుపురుషునినామజాత్యాదు లత్యంతప్రసిద్ధంబు లగుటచే లోకంబున నెఱుంగనివా రుండరు. రాణివాసపుకలుగంటు లగుటం జేసి మీ రెఱుంగ రేమొ యని యెఱింగించెద నంటి నేని లోకంబున నెవ్వ రెంత మనసిచ్చి మాటలాడెదరొ వారితో నంతమాత్రమే చనవిచ్చి మాటలాడవలయు నే కాని యధికప్రసంగమునకుం జనుట యుక్తంబుగాదు. మీగెలుపోటములు తేటఁబడుటకు నేఁ జెప్పినదియె చాలు. ఇతరాంశంబులం దలపెట్టు టవలన కాలయాపనంబుతక్కఁ బ్రయోజనంబు లేదు. నీ పేరు ప్రభావతియు నీచేటి నామంబు రాగవల్లరి యనియును దెలిసికొంటి. ఈమోమాటంబును మరువకుఁడు. పోయి వత్తు" నని నింగి కెగయఁ జూచిన, దానవపుత్త్రి తనకరాంబురుహంబున శకుంతంబును గదిసిపట్టి పాణిపీఠం బెట్టి వివిధప్రకారంబుల ప్రియానులాపంబులచే ననునయించుచు

"శోకాదంబకాంతా! నీరూపలావణ్యాదులయింపును, నీగమననైపుణ్యంపుసొంపును, వచో విశేషవైభవంబుపెంపును, దిలకించిననాటగోలె నీచెలిమికై నామనం బువ్విళ్ళూరుచున్నయది. నీనేర్పరితనంబు గొంత యెఱింగినయనంతరంబు నిన్ను జాగవిడుచుటకు మనంబు గొల్పకయున్నది. పేరునకు రాగవల్లరి చెలికత్తియ కాని నీవు నాబహిఃప్రాణంబ వని నిశ్చయంబుగ వక్కాణింపఁగలను. వినయపూర్వకవచనంబులచేఁ గరంబుఁ బ్రార్థించు నావిన్నపంబున కియ్యకొని నన్ను ధన్యురాలినిగఁ జేయు నాచెలిమి కొడఁబడవలయు" నని వేవిధంబులఁ గోరుచుండ, నాదనుజకన్యాలలామంబును గాంచి హంసి "నీ వేకారణంబుచే నాసఖ్యంబును గోరుచుంటివో, యాకార్యరహస్యంబునకు విఘాతంబు గలిగిన యెడ నాచెలిమి దుస్సహం బగు. దానిచే నిప్పటిమీమంతనంపుంబనిరక్షణకై నన్ను వీడ్కొలుపుట యుచితంబు గావున పోయి వచ్చెద ననుజ్ఞ ని" మ్మనుటయు, రాగవల్లరి విని "యోహంసలతల్లీ! పోయెదఁ బోయెద నంచు మామనంబుల నేల కలంచెదవు? మారహస్యకార్యరక్షణంబునకు నీయునికి విరోధించునది కాక నిర్వాహయోగ్యమై సకలసుఖంబులఁ జేకూర్చు ననుటకు సందియంబు లేదు. తన్నిమిత్తంబుగ నీస్నేహంబు గావలయు నని నిన్నింతగఁ గోరుచున్నారము. కాని నీయాకారరామణీయకంబునకుఁ దవిలి కాదు. నీసరసవచనంపుసొంపు దిలకింప మారహస్యంబు నీకు వినిపించుట యుక్తంబె యైనను శుద్ధాంతకాంతారవాసదోషంబునం జేసియు ముగ్ధనాయికల మగుటం జేసియు మేమయి యామాట మాటువెట్టక త్వరితంబుగ వెలిపుచ్చనేరకున్నారము. మనసిచ్చి ప్రార్థించినం గాని యేకార్యంబునకును నీవు పూనుకొన వని యున్నంత వచియించితివి. మేమా కార్యంబును మఱుంగుపెట్టి భాషించుట నీకడ భేదిం బోకొట్టుట గాని వేఱు కాదు. వాక్యచతురత్వంబున నిన్ను మెప్పించుట మాకు శక్యంబు గాదు. నీవు చూచితి వన్నట్టి శుభాంగుఁ డీసుందరాంగిమాపాలి కాప్తుఁ డైనవాఁడు. అతని నామజాత్యాదుల విచారించి సంతోషపఱుపుము. ఆసమాచారంబు వినిపింప జాగొనరించెదేని నీకమనీయగాత్రి మనంబున కాయాసంబు గలుగఁ జేయుటయు గాని వేఱు గాదు. కరుణించి శీఘ్రంబ యాయుదంతంబు నెఱింగించి రక్షింపుము. అనంతరంబు మావృత్తాంత మామూలాగ్రముగ నీకు విన్నవించెద" మని యాతురంబుగఁ బలికిన, శుచిముఖి తనపక్షిరూపం జాలించి "సఖియలారా! మీ రంతఃపురవాసు లగుటచే మీయాత్మలతోడుగ తేటతెల్లంబుగఁ దెలియఁజేయక గూఢంబుగ దాచి యత్యంతరంబుగఁ బ్రసంగించుచు నిష్టమనుకుంబచే

నేమి చెప్పిన నేమి మోసము వచ్చునో యనుసంశయంబున నూరకుంటిని. మీ రిట్టు మీరు బైటఁబెట్టుటచే నిఁక నాపురుషరత్నముసమాచారంబుఁ జెప్పెద నాలకింపుఁడు.

కలదు గదా ధరారమణి కలంకారం బై సకలజనసంస్తవనీయం బైనభరతఖండంబు నందు సకలవిధభాగ్యంబులకు స్థానం బై యొప్పుచుండు ద్వారక యనుపట్టణంబు. దానిసౌందర్యసౌభాగ్యంబును నే నెఱిఁగినంత నెఱింగించెద నన్న, మీరు కథావిలంబ నంబునకు సహింపఁజాలరు గాన దాని నటుంచ నిం'' డని పలికిన, హంసి కామద్దియలు «నీ వెఱుంగని దే మున్నది? మేము వేఱుగ వచియింప నేల?'' యని వక్కొనిన, మరాళంబును నవ్వి «మందయానలారా! ఆపురీవరంబున యదుకులాంబోధియందు దీన రక్షణపరాయణుం డగు కేశవుండు మానవావతారంబును దాల్చి కృష్ణనామంబున విరాజి ల్లుచున్నవాఁడు. ఆతండు తనభార్యలతోడం గూడి సకలవిధసుఖంబుల ననుభవించు చుండు. అందు లావణ్యరాశి యగురుక్మిణి యనుకాంతకు కుమారుండై జనించి ప్రద్యుమ్న నామంబున నొకసుందరుండు దినదినజనితయౌవనంబుచేఁ గరంబు ప్రకాశించుచుండు. ఇందు వ్రాయఁబడినది యాతనిదివ్యరూపంబు. ఆతనిగుణగణంబులు గణనాతీతంబులు. శౌర్యగాంభీర్యకారుణ్యంబులు వర్ణనాతీతంబులు. సౌందర్యసుకుమారంబులు శిరీషపుష్ప కోమలంబులు. ఎం తని వర్ణింతు? ఏయేపట్ల నెంతెంత యుచితంబో యంతయంతయుం గలిగి విలసిల్లు'' నని వచియింప, నారాక్షసకన్యారత్నము సంతోషాయత్తంబున పరవశ త్వంబు నొంది వికసితవదనారవిందముతోఁ గులుకుచుండం గాంచి రాగవల్లరి ప్రమదంబు నొందుచు «చెలీ! నీకు వరం బొసంగినయార్యామహాదేవివాక్యంబునకుఁ దార్కాణంబుగ నీవలపుకానివానిజన్మకులంబును నివాసంబును దెల్పి మరాళి నీసంశయనివారణం బొనరించినది. ఈకాదంబకాంతవచనచమత్కారలాలిత్యంబు విలోకింప మీఁదికార్యంబును నిర్వహింపనట్టిగట్టితనం బీమెకడఁ గన్పట్టుచున్నది. మొదటినుండియు విద్యా విశారదయై సకలవిద్యలం గ్రహించి సత్సత్ప్రసంగసంపదచే వరలుచుంటచే నేమొ కాలి యందు పెండెరంబు నొక్క-దానిని ధరియించియున్నది'' యని దానిపైఁ గల వర్ణంబుల నుచ్చారణక్రమంబుగఁ జదివి యాగండపెండేరంబున కబ్బురం బందుచు హంసిని ప్రశ్నించి దానిజననామవిద్యాభ్యాసక్రమంబు విని «మనకోరికలు దీర్ప నీమెయొంతయే శరణం బుగఁ గన్పించుచున్నది. కాని వేఱొండుపాయంబుఁ గాన'' మని యానీడోద్భవం బునకుఁ దనయనుంగుచెలికల తెఱంగు వివరించి తదాదిగ నప్పటివఱకును బ్రభావతి పొందు'

భక్తచింతామణి యగుభవాని నీయభీష్టంబున కాటంకంబుఁ గలిగింపఁ దలపెట్టదు. కావున సంశయాస్పదం బైనప్రద్యుమ్నసమాగమప్రయత్నంబు వీడి నాచేఁ జెప్పఁబడిన వారలలో నొక్కనిఁ గోరుకొన్నను నీరూపసౌందర్యాదిగుణంబుల వానికడ వర్ణించి మోహపాశబద్ధునిఁ గావించి నీకింకరునిఁగఁ జేసెద. నీరూపసుకుమారాదుల నింతకయు నీ వెఱుంగవు కాని నీయాకారరామణీయకంబు విన్నవారలు నీయందు బద్ధానురాగులు కాక యుండఁగలరా? ఆరుక్మిణీకుమారుండు యౌవనరూపలావణ్యంపు పెంపుచే గర్వించి యున్నవాఁడు. అతని నట్లె సంతోషింపనిమ్ము. తక్కినవా రతనిపోలినసుకుమారా కారు లనరాదు. కాని సకలలోకసంచారిణి నైన నా కెందఱెందఱో సుందరా కారు లగపడుదురు. వారలరూపంబులు పటంబున వ్రాసి తెమ్మనియెద వేని తెచ్చెద. అంత నీయిచ్చవచ్చిన మెచ్చుకొని యుచ్చటఁ బరిణయింపు'' మనిన, నాయంచమాటలు ప్రభావతికి వెగటుగఁ దోపఁ గొంతతడవు చింతించి నిట్టూర్పు విడిచి కలకఁ బారిన మనంబుతో ప్రభావతి హంసి కిట్లనియె. "చిత్రఫలకంబును జూచుటాదిగఁ జిత్తము బంధంబున దగిలింపఁజేసి సమాగమ మెన్న డెన్న డని దినములు పుచ్చుచున్న నాకుఁ బ్రాణసఖి వై ప్రియునియుదంతంబుచే క్షణానందంబు గావించిన నీప్రభావానులం గాంచి నీవల్లన మనఃకలుషము దీరు నని నమ్ముకొని యుంటిని. హంసీ! తుదకు నీకథనంబున విరసంపుపలుకులం బల్కి నామనంబున కాయాసంబుఁ గలుగఁజేయం బాడియే? మున్ను వజ్రనాభుండు నన్ను స్వయంవరవిధానంబునకు నియోగించినవాఁ డై యిప్పుడు నీచేఁ జెప్పఁబడినరాజకుమారులరూపంబుల వేఱువేఱుగ వ్రాసి చూపించెను గాని యాసుంద రాకారులలో నెవ్వనిఁ గోరుటకును మనస్కరించినది కాదు. నాగతి యెట్లున్నదియో యెఱుంగరాదు. మున్ను నాతండ్రి రూపవంతు లగువారిని రచియింప నవసరంబున సకలసద్గుణసమేతుం డగునీసుకుమారాకారుని రచియించి చూపుటకు నీతనిరూపంబును బటంబున లిఖియింపసమర్థత లేమింజేసియో, తా నెఱుంగఁడో, మానవుం డని వ్రాయ మానెనో, కులవైరికుమారుం డని తలంచెనో యెఱుంగఁజాల. ఇవి యన్నియుం దలంచి కుందుచుండిన నేమిప్రయోజనంబు? హంసీ! ఆయదునందనునందు నామనంబు చిక్కుకొని వీడిపోకయున్నది. భవానిభాషణంబుచందంబు విచారించుచు నరునివాంఛాస్పదురాల నగుదునో కానో యని సంశయించుచున్నదాన. కావున నామనోనిశ్చయంబును దెలుపు నాప్రతిజ్ఞావచనంబుల నాలకింపుము. ప్రద్యుమ్నునిం దక్క నేలోకమునకు నెక్కువ వానిఁ గల నైనం గోర. అప్పురుషపుంగవుండు నాపొందున కియ్యకొనక చేఁగొనఁడేని

మేపాటిది? రతియాకారంబునకన్న మిన్నగ నుండునా?’ యని ప్రశ్నింప విరించి రతిరమణీయు మెక్కడ? ప్రభావతి యాకార మెక్కడ? రతికన్న మూఁడునాలుగింత లధికంబు. ఆమె మదీయసృష్టియందలిది కాదు. పార్వతీప్రసాదంబున నుద్భవించి పెంపొందుచున్నయది. వేఁగ జను’ మన నాతండు కాలయాపనము సహింప కుండుట గాతింగినదాన నై మీఁదివాక్యం బేమియుఁ దలపెట్టక వేగంబ యటనుండి కదలితి. కాలక్రమంబున నట్టిప్రభావతి నీ వని తెలిసికొంటిని. నీవల్లభుం డగుప్రద్యుమ్నుఁడు నీవర్ణన నాకర్ణించినవాఁడు గాన నాటనుండియు సమాగమంబునకై నీకంటె నెక్కుడు త్వరపడుచుండు నని తోఁచుచున్నది. రతియాకారంబు నీపై మోహంబును మరలింప నేరదు. మదికలంక వీడియుండు’’ మనిన ప్రభావతి హంసపలుకులకు సందేహంబునొంది రాగవల్లరిమోము గాంచుటయు, నామె తదభిప్రాయం బెఱింగి మరాళి కిట్లనియె. “కాదంబకాంతా! సమయానుకూలప్రసంగసామర్థ్యంబు కేటవడ నేప్రశ్నంబున కాయర్థంబు సరిపడం బలుకుచున్ననీవచనంబు లత్యాశ్చర్యకరంబులు. మదనుండు ప్రభావతిపై మక్కువచే వెతలంబడుచుండిన మన కర్యోద్యమప్రయోజనం బేమి? మనచెలి కోరినచెలువుం డీమెపైఁ బ్రేమ జూపినఁ గదా మనము సంతసింపవలయు’’ ననిన విని హంస మందహాసం బొనర్చి “మదవతులారా! మదనుం డన విని యున్నారు కదా! ఆతండు తొల్లిటిరూపంబుతో రుక్మిణీరమణిగర్భంబునఁ బుత్రుండుగ నుద్భవించి యున్నవాఁ’’ డని వారికంశయంబుఁ దీర నదుత్తరం బొసంగె. నావుడు మురారిసుత యాశలు కొనలుసాగ ప్రియాసమాగమాపేక్షతో వేగిరపాటున మరాళబాలికం జూచి “నీపలికినవాక్యంబులు నిక్కంబు లైన నాపుణ్యం బెంతదవ్వొ గదా? నీ వరుగు టెప్పుడు? వ న్నాతఁడు వరియింపనట్లు చేయు టెప్పుడు? నాయందనురాగుం డైనను దా నీప్రశంసలవలనఁ జనుదేర జనకునాజ్ఞ గానలయుఁ గదా? అట్లు రాఁగలిగిన జనకుండు మదీయవాంఛానుకూలుం డై వర్తింపునా? యివి యన్నియు నెరవేరనికలంపు’’ లని ధైర్యంబు తూలఁ బలవింపుచు వెలవెలబోవుచున్నయాసనంబునఁ జెంగట నున్నయొక్క భూరుహంబున బంధంబులం జిక్కియుండు శుకంబు ప్రాణార్తిం దనారుహంబులం దటతటం గొట్టుకొనుచు నెగయ నుంకించుచుండ శుచిముఖి రాగవల్లరులతోడం బ్రభావతి కదలి వృక్షంబు చెంగట కరిగయంబున నరుగ, రాగవల్లరి భూరుహంబు నారోహించి శుకంబును గదలకుండం గబళించి పట్టి యురి సడలింప కీర మామెహస్తంబులం గరచి విడిపించుకొని గగనంబున కెగసిన కీరపక్షంబులనుండి పెసలూటచే నొకకమ్మ జారిపడె,

దానిం దిలకించి వెఱఁగంది "యిట్టిది యతివిచిత్రముగ నున్నయది చూచితివే? ఈయంశంబు ప్రమాదకారణంబు గదా? నిశ్చయంబుగ దైత్యాంతకపురంబున నెవ్వరి కెవ్వ రంపిరో తెలియుంగ. శుకంబును బట్టి తేనొప్పుదే మరాళీ!" యని ప్రభావతి పలుక, "అతిరయంబున నెంత పోఁగలదు? ఇదే పట్టి తెచ్చెద" నని పంతంబున హంసి దాని వెన్నంటి యరిగిన, దానవపుత్రి రాగవల్లరిం జూచి "చెలీ! యీప్రదేశంబున నురు తెవ లొడ్డిరో యాశ్చర్యంబుగ నున్నది" అన, రాగవల్లరి "సఖీ! చెలిక చీదరఁ గొలిపెడు శుకపికాళిని శిక్షించు నెపంబున నే నొనరించినయపరాధం బిది కావున క్షమియింపుము. ఓచంద్రవదనా! యీలేఖచందం బత్యద్భుతంబుగ నున్నయది. ఏది చదివి చూత" మని యామెహస్తంబులనుండి పత్రిక నందిపుచ్చుకొని విప్పి యీవిధంబునఁ జదువ నుపక్రమించె.

"శ్రీమత్సకలగుణగరిష్ఠవిద్యావిశారదశారదాంబాకృపాప్రసాదసంభావిత, యనుపమానితమూర్తికామధేనుబిరుదాంకిత, సరసవాక్యవిశేషసంప్రయుక్తరమణీయనూపురసంశోభితాలంకారవామపాద యగు శుచిముఖీనామధేయకు ప్రద్యుమ్న దతికుతూహలంబున వినయపూర్వకంబుగ రచియించి పంచినసరహస్యపత్రిక:—

ప్రియప్రభావతియాకారగుణసౌందర్యాదుల నీ వత్యంతరమణీయంబుగ వర్ణించు"- నని చదువుమనె. యపరిమితానందంబున నుబ్బి తబ్బిబ్బై శరీరంబు పులకరింపఁ బ్రభావతిం గౌఁగిలించి "నీ వపరిమితభాగ్యవంతురాలవు. ఇది నీనిమిత్తమై ప్రియుం డంపినలేఖ" యని రాగవల్లరి పలికినఁ బ్రభావతి "చెలీ! నీవు చదివినయట్టిపత్రికయందుఁ గలదా? నను నవకించుట కిట్లు పలుకుచుంటివా? ఏది యిటు చూపు" మని చేరఁ జని చేయి చాచిన, నామె కొంతదూరంబుగఁ దొలఁగి "నీ దేవునితోడు? పత్రికయందలిసమాచారం బామూలాగ్రంబుగఁ జదివెద వినుము. అనంతరంబు నీకొందువు గాక" యన్న ప్రభావతి చెలింజూచి "మూతం డే వ్రాసె నని నిశ్చయించినను ప్రియప్రభావతి యనుకస్య రొయఁవతిరయి? నా కీపలుకే. యింకను నిలిచి పరికించి చూడు" మన రాగవల్లరి ప్రభావతి కిట్లనియె. "ఇత్యాది నీ నామంబె యనుటకు సందియంబు లేదు. సమాగమవిలంబనసంతాపభ్రాంతిచే నీవిధంబున నగ్నపువటకిగ వ్రాసినవాఁడు గాని వేఱు కా" దన విని "అమ్రమ్మరాలా! యిట్టియట్టుఁ జదివి మిగిలినభాగంబు వేగంబ చదువుము. నే నిచటనే యుండెద" ననిన రాగవల్లరి యట్లే చదివెద నాలకింపు" మని మరల నిట్లని యారంభించె.

రేఁబుంగరా" దనుటయు, హంసి "నిను బోనిచ్చినను భయంబు లేదు." కమ్మ మాచేఁ జిక్కినది. అయినను వెంట రమ్ము. రాకేని నీ కాయసంబు దక్క నీ విడిగలంబడి రాకున్నను విడువదానను గాను. అరుదెంచితి వేని రాచకన్యమనంబునను జాలి గలుగఁ జేసి నిన్ను విడిపించెద" నని బలిమిచేఁ గొనిపోవుచుండ, మరాళంబును గని కీరంబు "ఏల నీ కీపంతంబు? నారహస్యంబులు నీవు వినఁగోరదవేని వివరించెద. రహస్యంబును వెలి పుచ్చుట కీవు ముగ్ధవు గావు గాన భయంబు లేదు. ఇచ్చట దాచినను నామొకడ కీవు కొనిచనిన నారహస్యంబు తేటబడుటయు నాప్రాణము పోవుటయుఁ దటస్థించక మానదు. సావకాశంబుగ నొక్కయిరవున నిలిపి నావిన్నపంబును విని నీ వేమి చేయ ననుమతింతువో యట్లు జరుపు" మన, మరాళి యప్పటి కదియె యోగ్యంబుగ గ్రహించి సంతసించి నలుకేలంకులం బకికించి సమీపంబున నెచ్చటఁ జెట్టుగుట్ట లేనిగట్టుచిట్టచివరం బెట్టి "లేఖసమాచారంబు తేటపడఁ జెప్పు" మనుటయు కీర మిట్లనియె. "ద్వారకాపురం బున నే నొక్కకారణంబున వరిగె తిరిగి వచ్చునవసరంబున సుందరాకారుం డగు నొక్క రాజ కుమారుండు వ్యాకులచిత్తంబుతోఁ గిరకారికాపరభృతషట్పదంబులం జేరి 'మీరు వజ్ర పురికిఁ బోవువారె' యని పలువిధంబులం బలవించుచు నామాటలకు మాఱు పలుకుఁ డని ప్రార్థించుట నాలించి, 'నేనాపురంబున కరిగెద. నాచే నయ్యేకుమ ప్రయోజనంబు వినిపింపు' మన మహోత్సాహపూరితుం డై యాతండు నన్ను వీక్షించి 'యోశుకవంశసంజాతచూడామణీ! నీవు నాకొనరింపఁగలమహోపకారం బొండు కలదు. వివరించెద నాలకింపుము. వజ్రపురంబున శుచిముఖి యను పేర నొక్కహంసి కలదు. ఈకమ్మ యాకొమ్మ కి" మ్మని వేడుకొనుచు, నామొమ్మ కానిదీనత్వంబు దలంచి నెమ్మనమ్ము దయాభరవశతం జెంద నే నాఁగాములు విచారింపక కమ్మ కాదంబకాంత కందించుటయె గదా! దీన నేమిముప్పు వాటిల్లు నని యెంచి ధీరత్వంబునఁ గమ్మ పక్షంబులమయింగున నడంగియుండునట్లు గట్టించు కొని చనుదెంచి యాయాపవనప్రాంతసరోవరంబునఁ జక్రాంగంబులసంచారసంరావ మాలించి యేగుదెంచుచు సఖ్యంబుగ సారసాతులసమీపంబున సంచరించుచున్నం గాంచి శుచిముఖిసమాచారం బేమైన తెలుకవదు నేమొ యనుతలంపున నామహీరుహంబున వ్రాలి బంధంబుల జిక్కి "యీవిధంబున నీచే బాధలకుఁ బాలుపడితి" నని వచింప, మరాళి యది తనకార్యంబుగ గ్రహించి సంతోషంబును దిగమ్రింగి తనపేరఁ బత్త్రం బంపువాఁడు మోహితుండు కాక మానఁ డని యాపత్త్రికసమాచారంబును దలఁచి యడుగక

"నీ కాపురంబునకుం జనఁ బని యేమి కలిగెఁ? యథార్థంబు వచింపు" మన, కీరంబు సంకోచంబునఁ గొంకియుండె. నావుడు మరాళి దాన నేదియో విశేషంబు గల దనుతలంపునఁ బాదంబులం గలకీరంబును బిగింప, నది "నాప్రాణంబును బోఁగొట్టుకొనుట కైన సనుమతింతుఁ గాని నీవు గట్టిప్రమాణం బొసంగినం గాని యారహస్యంబు బైటఁ బెట్ట నిచ్చగింప" నని బింకంబున నుండ, మరాళము "మేలు. కీరమా! మేలు! మాననీయు లగువారు నవనిధానంబు లొసంగినను, కుత్తుకం గత్తి హత్తించినను, పోషకులరహస్యభంగంబునకొసంతయు సమ్మతింపరు. అట్టినీరహస్యంబు వెలిబుచ్చిన నా కేమిలాభంబు? దేవునాన! వెలిబుచ్చ" ననుటయు, కీరము మరాళముం గాంచి యిట్లనియె.

"వజ్రనాభునకు సునాభుం డను ననుజుండు గలఁడు. ఆతనిగర్భవాసంబున నతి సుందరాకారు లగునిద్దఱుముద్దియ లుదయించిరి. వారు చంద్రవతి గుణవతి యనునామంబుల వరలుచున్నవారు. నారదుండు సంచారవశంబున నొక్కనాఁడు సునాభునిమందిరంబున కేతేర, సునాభుం డాతని సకలవిధసత్కారంబులచే సంతృప్తుం గావించి పరిచారకులతో దేవేరు లుండుభవనంబున కనుపుటయు, వా రాతనియాశీర్వచనముల నందుటకు దగినట్టుల మునీశ్వరుఁ బూజింపుచుండ, చంద్రవతీగుణవతులు వినయపూర్వకంబుగ మునిసింహునియొద్ద కరుదెంచి నమస్కరించిన నాతండుఁ 'పతులం బడసి పుత్రవంతులరై సుఖంబులఁ బడయుఁడు' దని దీవించె. అంత నచ్చటిదాది "ఓమునిచంద్రా! యీసుందరీమణులను వరింపనుందరాంగు లెవ్వరో వారినిఁ బేర్కొనుం" డనుటయు, మునియుఁ గొంత చింతించి తల పంకించి విమలయశోధనులును, ద్వారకాపురీవాసులును, యదువంశసంభవులును నగుగదసాంబు లనువారీపూఁబోఁడులకుఁ బతులు గాఁగలా" రని వచించిన, నాతనిభాషణంబునకు వారు భీతి చెంది "కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటిమి. ఎక్కడి ద్వారకాపురం బెక్కడిగదసాంబులు! అప్పురం బసురవిరోధికిఁ గాపురం బని వినుదుము. ఈసమాచారంబు సునాభునిచెవి సోకెనేనిఁ గీడు మూడకమాన" దని యాసమాచారంబును వెలిఁబడనీయక యడంచిరి. సునాభపుత్రిక లావలుకుల నాలించిననాటఁ గోలె మనంబులఁ గోర్కులు కొనలుసాగ బద్ధానురాగచేతస్కలై చింతచే నందురుచుండ నన్ను వినోదంపుచెలిగాఁ బ్రేమంబునఁ బెంచుచున్నకతంబున నే నామదవతులమనంబు మన్మథాయత్తంబున మెలఁగుచుంట మాటలక్రమంబునం గనిపెట్టి "మానినులారా! నను సాకుచున్నమీకు మేలు చేయవలె ననుతలంపు నాకు వొడమినది. మీ ప్రేమాస్పదు లగువారిక్షేమంబు నెఱింగి యాదనైనను మీమనోవాంఛలఁ దెలియం బలికి ప్రత్యుత్తరంబుఁ దెత్తు నంపుఁ" డని వాక్రుచ్చి యవ్వనరుహాక్షులు నాయెడబాటున కియ్యకొనకున్నను విపులప్రయత్నంబున వినువీథి గమనోన్ముఖుఁనై కదలి ద్వారకకుం జని

కార్యంబు బుద్ధివిశేషంబుచే నడపెద. దైవంబు తోడగుఁ గాక! పోయి వచ్చెద. యుపవనసరోవరంబున నే వర్తించుదాన. పనిపడినఁ బిలిపింపు'' మని పలికి చనియె.

అనంతరంబు ప్రభావతి జనకుని చెంగటఁ బ్రసంగవశంబున "మానససరోవరంబునఁ జరియించు జలచరంబులలో శుచిముఖి యను హంసాంగన విద్యావివేకంబుచే వఱలుచున్నది. దానిచాతుర్యంబును విని తీరవలయు'' నని ముచ్చటింప, దానవపతి పుత్రికమాటలు ముద్దుసేయుచు "అమ్మ! చూతము. మరాళిని రప్పింపు'' మన నట్లనె రప్పించి, "శుచిముఖీ! నీవిద్యావైశారద్యంబును వినవలయు నని మదీయజనకుఁడు వేడుకపడుచున్నవాఁడు. వివరింపు'' మన నదియు నమృతంపుసోన లొలుకుమృదుపదంబులచే వ్యాసగౌతమకాణాదసాంఖ్యశాస్త్రాంశంబుల నుడువుచు, బాధకంబులఁ బూర్వపక్షంబుఁ జేయుచు మతభేదంబులఁ గ్రోడీకరించి సిద్ధాంతంబుఁ జేయుచు, మతస్థాపనంబున న్యాయం బవలంబించి యన్యాయమతంబుల దూషించుచు, సకలశాస్త్రంబులమహిమల నగ్గడించి దానవుని వ్యామోహితుం జేసి యాతనిచే బాపురే యనిపించుకొనియె. కతిపయదివసంబులు గడువ వజ్రనాభుండు శుచిముఖి నవలోకించి "వింతలే వైనఁ గలవేని దెలియఁ బలుకు'' మన నాయంచ యించుక యోచించిన ట్లభినయించి "యెంతెంతలు చోద్యంబు లైనను గనివినియుంటిని గాని యిట్టివాని నెందును జూచినది లేదు. విన నవధరింపుము. భద్రుం డను నటుని నాట్యవిద్యాకౌశలంబు చూడఁదగ్గదియె కాని వచియింప సాధ్యంబు గా'' దన విని యాతండు జూడ వేడుకపడి నటునిఁ బిలువు మన నట్లె యని ప్రభావతితోఁ బోయి వచ్చెద నని యామె తన్ను వెంబడింప "మదవతీ! నీమక్కువకాని నిట దెచ్చు నిమిత్తమే సుమీ యీపన్నుగడం బన్నినదాన'' నని పలికి సెలవు గొని ద్వారకకుఁ జనియె. అట కృష్ణునిం గాంచి నటునిఁ దెత్తు నని వచ్చుటయుఁ, సునాభుతనయలు నారదవచనానుసారంబుగ గదసాంబులఁ బరిణయంబు కా నుండుటయు నెఱింగించి దానవసంహారంబునకు వీరిరువురు ప్రద్యుమ్నునకుఁ దోడుపడఁ బనికివత్తు రని తెలిపి గోవిందునియభిమతంబును విని తదీయమతానుసారంబును బురంధరునకు విన్నవింప నాకంబున కేగుచుఁ బ్రద్యుమ్నునికడ కరిగి,

హంసి—చిలుకచేఁ బత్రిక నంపితి రే!

ప్ర—అది నీ కందినదియా?

హంసి—ఎవ్వరింగూర్చి యనిపితివో వారికె చేరినది.

ప్ర—ఆలేమ శుభంబుగ నున్నదియా?

హంసి—ఉన్నది నీపై ప్రేమచేఁ గుందుచు.

ఈవిధంబున హంసి దానవపుత్రితెఱం గెఱింగించి «మాధవపుత్రా! మున్నామె రూపంబును వర్ణించుతరి నీమనంబు తేటబడమిం జేసి యప్పటి కదియె చాలు నని యూరకొంటిని. ప్రభావతి యన్నదో పార్వతి యొసంగినచిత్రఫలకంబునం గలనీరూపంబునకుం దనిసి నిన్ను వరింపఁ దమకపడుచున్నది. నీకమ్మ యాక్షణంబున నందియుండ దేని నింతకుమున్నె పంచత్వంబు నొందియుండును.” అన విని ప్రద్యుమ్నుండు హంసితో «పోఁగలుగుదు నేని యెక్కలం గట్టుకొని యైన నాప్రదేశంబున వ్రాలవలయు నని యున్నది. ఏమి సేయుదు? ఆపురంబు వాయునకు నియనుజ్ఞ లేక యేవారికిని జొరనశక్యం బని వినియుంటిం జేసి వెనుదియ్యవలసె. అది యటుండ నిమ్ము. పురందరపురుషోత్తములచే యోజింపఁబడుకార్య మే మయ్యెఁ దెలుపు” మన మరాళి యాతనిం గాంచి «కుమారా! యాపురప్రవేశంబునకై చింత యావంతయు వలదు. ఆయుపాయంబు సర్వంబును నీజనకుండు స్థిరపరచియున్నవాఁడు. వజ్రనాభసంహారసాధనంబును నీయిష్టకార్యనిర్వహణంబును గలసి రానిన్ననుపునట్లు నిశ్చయపరచితి. అందువిషయమై నీజనకుఁడు నిన్నుఁ బిలిపింపనున్నవాఁడు. ఈసమాచారంబు వజ్రికి విన్నవించి వజ్రపురంబునకుం జని తావకీనకార్యానుసరణబుద్ధిం బ్రవర్తింపుమఁ దువ నెగ్గించెద” నని పలికి యటనుండి కదలి చనియె.

పిమ్మట దేవకీనందనుండు ప్రద్యుమ్నగదసాంబులను బిలిపించి నిర్జరహితంబునకై వజ్రనాభనిర్మూలనంబు కర్తవ్యం బని పలికి నియోగించి యాపురం బితరులు చొరనసాధ్యం బని తెలిపి పురప్రవేశంబునకు కాదంబకాంత చెప్పినయుపాయంబుఁ దెలిపి ప్రద్యుమ్నుండు భద్రాఖ్యరూపంబును గదుండు సూత్రధారియాకారంబును సాంబుండు విదూషకవేషంబును దాల్చి పురిం బ్రవేశింపు డని పనిచిన, వారును బరస్పరసంతోషంబులతో నాట్యసామగ్రి సమకూర్చుకొని వజ్రపురప్రాంతశాఖానగరంబుల నాటకప్రయోగంబుల నెరపుచుండ, వజ్రనాభుండు విని వారలఁ దనపురంబులోనికి రప్పింప, వా రదనెఱింగి రాజుం దర్శించి నాటకము లాడ మొదల గొని రంగస్థలం బేర్పరచి యాటలాడనున్నతరి, శుచిముఖి యరుదెంచి ప్రభావతీచంద్రవతీగుణవతులకు పతులరాకతెఱం గెఱింగించి ప్రద్యుమ్నునికడ కేగి ప్రభావతి నీనాట్యంబును హర్మ్యంబుపై నుండి చూచు నని యొక్కమేడం జూపి చనియె.

వజ్రనాభుండు మిత్రబంధుసందోహంబుతో రంగస్థలంబునకెదుట నొయ్యారంబుగ సభ నలంకరింప, కపటనాటకసూత్రధారి యగుగదుండు వచ్చి నాట్యారంభమునకై పంచమషడ్జమస్వరగస్థాయిల కనుగుణరీతి గాత్రంబును శ్రుతిమేళనంబు గావించి మర్దళనాదంబు రసపుష్టి సేయ డెబ్బదిరెండుమేళకర్తలకళలను జూపించి నాంది ముగింప ప్రద్యుమ్నుండు దాని నందికొని సప్తతాళయుక్తంబుగ నడపించుచు విషమతాళగతులం జూపించుచు స్వరయుక్తంబును దప్పనీక మెలంగి గంగావతరణాది పెక్కునాటకంబు లాడి నర్తించరుల వ్యామోహితులం జేసి వారిసర్వస్వము నూచముట్టుగా దోచుకొనుచు మరాళవాక్యంబు మది నుంచి మేషపంక్తిం జూపు నిగుడించుచు నామానవతిని మెప్పింపం గాంచి శ్లేషార్థంబుగ నిట్లనియె.

"సకలకళలచే నొప్పారినయో నిజజాణ వజ్రనాభ కులావతంసరత్నమ ప్రభావతి గోపితకంటకం బగునీచూ పనురాగసహితంబుగ నాపైం బర్వెం గాన నానుకృతంబు నేండు ఫలించినది. హంస చెప్పిననాంటనుండియు నిను భజింప వేడుక పొడమినయది. నీయాడికంబు మనంబున కెక్కంగం జేసి యిష్టానుసారంబుగ మెలంగెన. నేలికొను" మన ప్రభావతి విని లజ్జచే మొగంబు వంచుకొనం దదీయసామీప్యవర్తి యగుచకాంగ తొయ్యాలి యనురనాయకతనూజం గనుంగొని "వింటివే! యాతనిమదిం గనుంగొంటివే! యామాటలయందలి యర్థద్వయచమత్కారంబు!" అన ప్రభావతి హసించి కిట్లనియె. "విచ్చలవిడిగ నాముంబుడు జేర్కొని నీపై నిచ్చచే వచ్చితి నని తెల్లంబుగ ముచ్చటించె, ఇంకేం విశేషార్థం బేమి గలదు? ఒరులు విందు రనుభయం బించుకయు లేక యెల్లరకుం దెలియునట్లు పెల్లుసిగ వచించుటచేం జిత్తచాంచల్యంబు పొడమినయట్లు పొడకట్టెడిని. నాకిదికృతం బెటు లున్నదియో తెలియంగం జాల" నని చింతింప శుచిముఖి యాశశి ముఖినిం గాంచి "యతివా! నీప్రియుం డతిజాణ. నీ కట్టిచింత వలదు. నీజనకాదుల కష్టం బగురీతి వారికిని, నీకు సంతోషం బగురీతి నీకును నర్థద్వయంబుం గల్పించి వచింపుంచినవాండు. ఎఱింగినదాన వగుటచే నీ కీయర్థంబు తేటంబడియె గాని యితరు లీ యర్థంబు గ్రహింపం జాలరు. ఈపలుకు లితరులు విని రనుశంక యావంతయు మనంబున నుంపకుము. నాట్యావసానసమయమునం బ్రార్థనంబునకై పలికినపలుకు లగుటచే రాజుచే సన్మానింపంబడి ఒడిది కనుపంబడుచున్నవాం" డని రాత్రి నేయుం జూపిన ప్రభావతి చక్రాంగవిభుక్తిచమత్కారప్రసంగంబును వీనులవిందుగ నాలకించుచు రాగవల్లరీసక్తి

తంబుగ నివాసంబున కరిగి ప్రియసమాగమకాంక్షచేత నూట లూరుచుండ ప్రద్యుమ్నుం
డును సమాగమకాంక్షచే రహస్యంబుగ ప్రభావతియంతిపురంబునకుం జని మక్కువచే
దనకుఁ దక్కె నెంచినచక్కెరబొమ్మచక్కదనము ప్రత్యక్షముగఁ గాంచి సొక్కి యా
యిందీవరదళాక్షిని శుచిముఖీరాగవల్లరులసమక్షంబున గాంధర్వవిధానంబున హంసి
«ప్రియాంముహూర్త స్సుముహూర్తోస్తు» యనఁ బరిగ్రహించి నాఁటిమొదలా మద
వతితో సంసారసౌఖ్యంబున నోలలాడుచుండ, చంద్రవతీగుణవతులు తమపతులతోఁ
గలయుట కుపాయంబు గావలె శుచిముఖితోఁ దెలుప, వారలకోర్కె నెరవేర్పఁ దలంచి
ప్రభావతీవర్ణనమిషచే ప్రభావతి లలిత మగుప్రియసమాగమవేషంబు చక్క దిద్దుకొనక
మున్నె వెంటఁ గొని రా, వార లామెచందంబును గాంచి సందియంబు మది గదురఁ
గ్రమంబునఁ బురుషునితోఁ గలసినక్రమంబు గనుపట్ట నొండొరులమొగంబులఁ జూచు
కొని నర్మవాక్యంబులచే నాలీలావతిని హేళనంబుఁ జేయుచుండ ప్రభావతి విషణ్ణవదనం
బుతో భయలజ్జాలోలయై ప్రత్యుత్తరం బేమియుం దోపక యుండ మరాళి యామెకు
దనచెలియండ్రరహస్యంబు వెలిపుచ్చ కున్న ప్రభావతి తళంకపాటు వీడకుండుటయే
కాక వీరియభిమతము గూడ నెరవేరఁబో దని విచారించి యిట్లనియె, «అతివలారా!
ఏల యీలీల హేళనంబుఁ జేసెదరు? మీరు చదివినపదువె యామెయుఁ జదివినయది,
మీకంటె వయోజ్యేష్ఠురాలు గావున పెద్దపిన్నతరుసచే నామెకోర్కె మొదటఁ ఫలించినది»
యనుటయుఁ బ్రభావతి తెలివిఁ జెంది హంసిం జూచి «యేమేమీ! వీరలగుట్టును నీచేఁ
జిక్కినదియా? దాని నామూలంబుగ వాకొనింగింపు» మనుటయు, హంసి తన్నధిక
లజ్జాభయంబులచేఁ గనుసన్నలచే వలదని వారించుచున్న చంద్రవతీగుణవతుల నాలోకించి
వచియింప శంకించుటయు, రాజనందన తనపై నాన లిడుచు నిడుపక పీడించుచుండ
మరాళి వారల నవలోకించి «మీర లెంత దాచినను బయలుపడక మానదు.
తీగఁ దీసిన డొంక కదలు ననుట మీరు నెఱుంగుదురు గదా. ఆన బెట్టి యడుగు
చుండ దాఁపు టెట్లు?» అని ప్రభావతితోఁ బ్రద్యుమ్నునిలేఖ సంతరించుకొని వచ్చిన
చిలుకనుద్దులు మొదలుకొని వారియత్నంబు సకలంబును జెప్పినఁ బ్రభావతి నవ్వుచు
సిగ్గునఁ దలవంచినముద్దియలం గని «ముచ్చులారా! మీరహస్యంబును గప్పిపుచ్చి నన్ను
హేళనఁ జేయుచుంటిరే! మీరును నాతోడిదొంగ లైతిరి. ఖిన్నతుండుఁ» డన నాయిం
తికి శకుంతకాంత యిట్లనియె, «లలనా! వీరును నీతోడివారలె గావున నీవు పూనికొని

నీప్రియునితోఁ జెప్పి గప్పింపవేని వారికోర్కి కొనసాగదు. నీవు పతితో నీయంశము వచియింప సిగ్గుపడి యూరిన నేఁడె నేను నీవల్లభునితోడఁ జెప్పెద'' ననఁ బ్రభావతి యంగీకారసూచకంబుగ కనుసైగ చేయ గ్రహించి సునాభతనయలం గాంచి «ప్రభావతికిఁ బతి యైనవాఁడు మహనీయుం డగుదివ్యపురుషుం డగుటంజేసి యాతనియనుగ్రహంబునం దక్క తక్కినయుపాయంబుల నీయంతిపురంబు మీవరులు చొర నలవడ దని యెఱింగినదానఁ గావున నిట్లు పలికితిని. ఇఁక మనమునం గలకొందలంబును మాని కొంగుముడివేసికొనుఁ డిదే నేటిమాపటికి మీపతులతో మిమ్ముఁ గూర్చెద'' నని పలికి లజ్జాసంతోషంబులతో ముదమందువారిని నిజనివాసంబుల కనిపె. ఈవిధంబున హంసాంగన యామింపబోఁడుల నమ్మించినదియై నాటిరాత్రి యాదవులవిడికిం బోయి యేకాంతంబున ప్రద్యుమ్నగదసాంబుల నొక్కచో నిలిపి «మీయందఱకును దలాయొక కార్యంబు గలిగి వచ్చితిని గావున మీమీకార్యంబులు నెరవేరినఁ గాని నాకస్వామి కనుకూలంబు కా'' దనుటయు, వారు మువ్వురు «తలాయొకకార్యంబు కల దని వచియించె. నావలె గదమయిద్దఱకును నిజార్థంబు కల దేమో?'' యని తమతమమనంబుల సమంబుగఁ దలపోయం దొడంగిరి. శుచిముఖియు వారియభిప్రాయంబు లెఱింగినది గావున «మీమీ ప్రత్యేకార్థంబులు మీలోఁ బ్రతివారికిని దెలియవేమొ? వినుం డని వారలం గోరినవని తలతెఱంగును వారిప్రేమలవిధంబును వివరించి ప్రద్యుమ్నునిం జూచి «నీ వొక్కండ వెందుఁ గడు నేర్పరివి. కావునఁ గాంతాసంయోగంబుఁ గాంచితివి. తక్కినవా రాతురతతో సఖులం గలియఁ ద్రోవఁ గానకయున్నవారు. వారలకార్యసాధనంబు నీహస్తగతంబున నున్నది. కావున నీ వందులకుఁ దగినయుపాయం బూహింపు'' మనియె. అప్పు డామువ్వురు తమతమరహస్యంబులు వెలువడిన వని నవ్వుకొని యొకరి నొకరు «నీవు వాసవుకార్యానుసరణబుద్ధిచే వచ్చితి వనుకొంటిని. ఇదియా విశేషం'' బని యెత్తి పొడువ, నాతండు «నీవును దానినిమిత్తమే వచ్చితివి గాఁబోలు! మేలు! మెచ్చుకొన వచ్చు'' ననిన, «మఱి నీ వెందులకో'' యని పరాగంబు లాడుచుండ, ప్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి «నీవు వెంటనె సునాభతనయలకడకుం జని మీహృదయేశ్వరు లిదె వచ్చెద రని యూరడింపు'' మని యనిపి తానును గదసాంబుల వారాత్రి తాను జనుచున్నరహస్యమార్గంబున దానవాంతఃపురప్రవేశంబుఁ జేయించిన వారును దమ్ముఁ గోరి యున్నవరవర్ణినుల గాంధర్వవివాహంబునం బరిణయం బై సకలవిధసుఖంబులం బడ

యుచు నప్పటప్పటికి నవీననాటకంబుల రసయుక్తంబుగఁ బ్రయోగించి వజ్రనాభుని వశవర్తిగాఁ జేసికొని తమ్ముఁ బరించినపద్మగంధులతో వనవిహారజలక్రీడావినోదంబులఁ గాలయాపనంబుఁ జేయుచుండఁ బ్రభావతికి గర్భోత్పత్తిచిహ్నము లంకురించి క్రమంబుగ నవమాసములు గడచినయనంతరం బొక్కశుభలగ్నంబునఁ దేజోవిరాజితుం డగునొక్క కొమరుండు గలిగిన, నాతనికి బ్రభావంతుం డని నామకరణంబుఁ జేసి యతిరహస్యంబుగ నంతిపురియందు రక్షించుచున్నంత చంద్రవతీగుణవతులును గ్రమంబున నవమాసంబులు గడచినయనంతరంబున నొక్కసుముహూర్తమందు సకలలక్షణలక్షితు లగుకుమారులం గన వారలకుఁ గ్రమంబుగ చంద్రప్రభుం డనియు, గుణవంతుం డనియు నామకరణంబులఁ జేసి భద్రంబుగఁ బెంచుచుండ వారును నానాట నల్లారుముద్దుగఁ బెరుగుచు విద్యావినయవివేకసంపన్నులై ధనుర్విద్యావిశారదులై వరలుచుండ వజ్రనాభుండు వారల సమాచారంబును దాదులమూలంబున విని యుగ్రుండై సభాసదులం గలయం జూచి "దానవముఖ్యులారా! కంటిరా! కాలవిపరీతక్రమంబు. మున్నెవ్వరో దానవాంతఃపురద్రోహంబున కొడిగట్టిరి! ఏమి వారికంత కావరము! దండధరునివాతఁ బడి యైనను దప్పించుకొన నొప్పును గాని నాకరటఁబడి తప్పించుకొనిపోఁగలరే? వినాశకాలము ప్రాప్తించుటచే నిట్టికార్యంబునకు సాహసించిరి. ఎందుఁ బోఁగలరు? సురలైనయెడ నేఁడు నాకమునకు బ్రళయము సంభవించిన దని నమ్ముఁడు. నాగకులజులైన పాతాళంబు పాడైన దని తలంపుఁడు. నరులైనచో వారిపొట్లు నక్కలకును కుక్కలకును గూడ నుండఁబో దని యెంచుఁ" డని ప్రతాపంబులం బలుకుచు తలవరి యగు భీమబలుని రావించి "నీ వేగి యంతఃపురద్రోహు లగుతుచ్ఛులఁ బ్రాణంబులతోడం బట్టి తె" మ్మని యానతిచ్చుటయు నాతండు పోయి రాకుండినఁ గ్రమంబున దండనాయకుని దళవాయిని నంపి పోయినవారి రాకఁ గానక పదతాడితభుజంగంబువడువున రోజుచు తనలోఁ దా నిముడక కార్చిచ్చువిధంబున మండిపడుచు పోయినవారు వారలఁ దోడ్కొనిరా కుండిన వారిశిరంబులం గొట్టి కోటగుమ్మమునకుఁ గట్టింతు నని శపథంబు జేసె. అనంతరంబు వజ్రనాభుండు కోపాటోపంబునం గను లెఱ్ఱవాఱఁ దనతమ్ముఁ డగుసునాభునిం బిలిపించి సైన్యంబును సమకూర్చి రథతురంగమాతంగంబులతోడం గదలి సేనానాయకుల బహువిధంబుల హెచ్చరించుచుఁ గన్యకాభవనప్రాకారంబు చుట్టుముట్టుకొనిరి. అప్పుడు తమవిడుదులలో నున్నప్రద్యుమ్నగదసాంబులు మన మీయెడ నంతఃపురప్రవేశంబు

